భగవత్స్వరూపులైన అమ్మానాన్నలకు

పాదాభివందనములు



**శ్రీ బొమ్మ వెంకటయ్య - శ్రీమతి కళావతి**

# మిమిక్రీ పాఠాలు

# Mimicry Lessons

342
UDL



శ్రీ భద్రకాళి దేవస్థానం - వరంగల్.

Rc.no: 1/2B/2002/P-204
Dt: 4/1/2003

ధ్వన్యనుకరణ ప్రపూర్ణ

**Ln. బొమ్మ శ్రీనివాస్**

B.Sc., B.Ed.,

**MIMICRY PATALU**

Written by :
**BOMMA SRINIVAS**

**Rs. 40/-**

**Library Rate : 55/-**

మొదటి ముద్రణ :
సెప్టెంబర్ 2002
ప్రతులు : 1000

ప్రతులకు సంప్రదించండి :

**బొమ్మ శ్రీనివాస్**
మిమిక్రీ ఆర్టిస్ట్ & వెంట్రిలాక్విస్ట్
ఇంటి నెం. 10-1-306, గోవిందరాజులగుట్ట,
వరంగల్ - 2. ఫోన్: (08712) 428299

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంకు స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాద్ (సుల్తాన్‌బజార్, అబిడ్స్)
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

***Title Designing :*** Ramana,
***Title Printing :*** Vamshi Multi Colour Offset Printers
HYDERABAD.

***D.T.P. Composed & Printed at :***
**VIJAY OFFSET PRINTERS,**
Beside : Dr. Narasimha Rao Hospital Lane,
Near Radhika Talkies, Warangal - 506 002.
Phone : 423428

***Title Photos :***
Jyothi Photo Studio, Chowrastha, Warangal.

# అంకితం



విశ్వవిఖ్యాత ధ్వన్యనుకరణ సామ్రాట్

పద్మశ్రీ

**డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ గారికి...**

# హృదయాభివందనములు



నను చేరదీసి

నన్నాదరించి

నన్నింత వాణ్ణి చేసిన

ధ్వన్యనుకరణ కళాప్రదాత

పూజ్యగురువు

ధ్వన్యనుకరణ కళాప్రపూర్ణ

**మిమిక్రీ పరమేశ్వర్‌రావు** M.A. **గారికి...**

మిమిక్రీ పరిజ్ఞానాన్ని

సాహిత్యీకరించే యజ్ఞంలో

వెన్నంటి నిలుస్తున్న

సాహిత్య రత్నం

స్నేహ హస్తం

హృదయనేస్తం

**షేక్ హాజి 'నూరాని' గారికి...**



పేదల సంక్షేమమే పరమావధిగా, సామాజిక సేవే లక్ష్యంగా, కళాకారులకు సైతం చేయూతనిచ్చే క్రమంలో ఈ పుస్తకాన్ని ఆవిష్కరింపజేస్తున్న...

**ఓరుగల్లు యునైటెడ్ చారిటబుల్ ట్రస్ట్, వరంగల్.**

# విన్నపము

మిమిక్రీ కళ అతి ప్రాచీనమైనది. అనుకరణ (మిమిక్రీ) ఒక అద్భుత మానవ కృత్యం. దశాబ్దానికి పైగా కళా ప్రదర్శనల్లో లీనమై, కళలో విలీనమైన నాకు తట్టిన చిరు ఆలోచనా పరిణామమే 'అనుకరణ' యొక్క సాహిత్యావిష్కరణ.

వెలువరించిన కొన్నాళ్లకే "మిమిక్రీ...మిమిక్రీ" పుస్తక ద్వితీయ ముద్రణ, ఆ వెంటనే తృతీయ ముద్రణ కళాప్రియుల సాహిత్యాభిరుచికి దర్పణం. ఇదో పెద్ద సాహిత్యవరమైన ఉత్కృష్టగ్రంథం కాకపోవచ్చు. కాని 'ధ్వన్యనుకరణ' కళను కళాభిమాని గుండెకు చేర్చే ప్రయత్నానికి మాత్రం తార్కాణం.

అశేష కళా, సాహిత్యాభిమానుల ఆశిస్సుల వల్లనే ఈనాడు నేను "మిమిక్రీ - పాఠాలు" అనే రెండవ పుస్తకాన్ని మీ ముందుకు తేగలుగుతున్నాను.

ఈ పుస్తకం హాస్య, వినోద, విజ్ఞానాల కోసం లిఖించిన మాటల మూటలు, హాస్య గుళికలు కల్పిత, వాస్తవాల సమ్మేళనమే కానీ, ఎవరినీ ఉద్దేశించి మాత్రం కాదు. మీ అందరికి పరిచయమున్న కొన్ని హాస్య సన్నివేశాలను కూడా సందర్భోచితంగా ఇందులో పేర్కొనడం జరిగింది.

వర్ధమాన మిమిక్రీ కళాకారులు మిమిక్రీని అవగాహన చేసుకొని, ప్రదర్శన లివ్వటానికి ఈ పుస్తకం HAND BOOK గా పనిచేస్తుందని నమ్ముతున్నాను. మిమిక్రీ అభిమానులే కాక, పాఠకులు కూడా ఈ పుస్తకం చదివి ఆనందిస్తారని, తమ అమూల్యమైన అభిప్రాయాల్ని తెలుపుతారని ఆశిస్తూ.....

కృతజ్ఞతలతో...

మీ

B. Srinivas

(బొమ్మ శ్రీనివాస్)

# KAKATIYA UNIVERSITY

**Prof. (Dr.) CHANDRAKANT KOKATE**
Vice-Chancellor

Vidyaranyapuri
WARANGAL - 506 009.
A.P. - INDIA

No. 367/VCP/KU/2002

Sep.12, 2002

## MESSAGE

The Book entitled MIMICRY LESSONS (in Telugu), written by Mr. Bomma Srinivas, a famous mimicry artist and Ventriloquist, is quite informative about the art of mimicry. The author has taken lot of pains in bringing out this book. He has prepared the book in such a manner that it it a teacher to the learner and informative to an ordinary man. The efforts put by Mr.Srinivas are quite laudable.

Mr. Srinivas, popularly knows as BOMMA SRINIVAS is known to me for the last fourteen years. He has in him the two arts,mimicry and Ventriloquism. He has a good talent in both of them and the audience are easily attracted with his presentation/performance. He is a recipient of DWANYANUKARANA PRAPOORNA, TOP TEN AWARD from kala vahini trust and BEST YOUTH AWARD from Government of Andhra Pradesh for 2002.

I congratulate Mr. Bomma Srinivas for brining out this book and wish him all the best in his future endeavours.

*(Prof. CHANDRAKANT KOKATE)*




*Padmasri*

**Dr. NERELLA VENU MADHAV**

*Ex. M.L.C.*

**Mimicry Artiste**


# మిమిక్రీ కళాకారులకు కరదీపిక

మిమిక్రీ కళను నేను ప్రదర్శిస్తున్న రోజుల్లో ఆ కళకొక స్పష్టమైన ప్రామాణికత అంటూ ఏదీ లేదు. ఆ కళను సోదాహరణంగా వివరించే పుస్తకాలు ఇంచుమించు లేనేలేవని చెప్పాలి. మొదట్లో మిమిక్రీ అంటే మేధావుల్లో కొంత చులకన భావం కూడా ఉంటుండేది. కుక్కలాగానో, నక్కలాగానో అరవడమే మిమిక్రీ అనుకునే వాళ్ళు. కానీ ఐదు దశాబ్దాలుగా నేనిచ్చిన అనేక ప్రదర్శనల కారణంగా నైతేనేం, ఇవ్వాళ్ల అనేక మంది నా శిష్య ప్రశిష్యులిస్తున్న ప్రదర్శనల కారణంగా నైతేనేం మిమిక్రీ కళకొక గౌరవప్రదమైన కళగా ప్రజలు గుర్తించారు. చాలామంది మిమిక్రీ కళకారులు ప్రదర్శనలు ఇవ్వడం వరకే పరిమిత మైపోతున్నారు తప్ప ఆ కళను గూర్చిన అనేక మెలకువల్ని ఔత్సాహిక కళాకారులకు ప్రయోజనకరంగా ఉండేలా పుస్తకాల్ని రాయడం లేదు. మొట్టమొదటిసారిగా మిమిక్రీ కళకొక సిలబస్‌ను తయారుచేసి, ఆ కళకొక ప్రామాణికతను సంతరించిపెట్టాలని నేనే ప్రయత్నం చేశాను. నా జీవిత చరిత్రను గ్రంథస్తం చేస్తూ, దాంట్లోనే మిమిక్రీ సిలబస్‌ను కూడా పొందుపరచాను. నా ఈ ప్రయత్నాన్ని చి॥ బొమ్మ శ్రీనివాస్ ఇంకా ముందుకు తీసికెళ్తూ మిమిక్రీ కళ మీద చాలా అరుదైన సాహిత్యాన్ని సృష్టిస్తున్నాడు. ఆయన ఇదివరకే "మిమిక్రీ...మిమిక్రీ" అన్న పేరుతో మిమిక్రీ కళమీద ఒక పాఠ్యపుస్తకాన్ని రచించాడు. ఈ పుస్తకం రాష్ట్ర ప్రభుత్వ ఆమోదం కూడా పొందింది. (Citation No. 2781/సా.తె./700/89.) ఇప్పుడు "మిమిక్రీ పాఠాలు" అనే పేరుతో మరో మంచి పుస్తకాన్ని వెలువరిస్తున్నాడు. ఈ రెండు పుస్తకాలు కూడా మిమిక్రీ కళను అభ్యసించి, ప్రదర్శనలివ్వానుకునే ఔత్సాహిక కళాకారులకు ఎంతో ఉపయోగకరంగా ఉంటాయి. ఈ పుస్తకంలో బొమ్మ శ్రీనివాస్ రూపొందించిన హాస్యగుళికలు ప్రేక్షకుల్ని నవ్వుల ప్రపంచంలో ఓలలాడిస్తాయి. "మాట్లాడే బొమ్మ" కోసం శ్రీనివాస్ రచించిన స్క్రిప్టు ఈ పుస్తకానికి హైలెట్.

మిమిక్రీ కళ మీద మిమిక్రీ కళాకారులకు కరదీపికల్లాంటి మంచి పుస్తకాల్ని రచిస్తూ వాళ్లకు చేయూత నిస్తున్న చి॥ బొమ్మ శ్రీనివాస్ ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.


**Shobha Nilayam**
# 11-25-45,
Vasavi Colony,
WARANGAL - 506 002 (A.P.)
Phone : 08712-**61388**


నేరెళ్ల వేణుమాధవ్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY

Prof. G.V. Subrahmanyam
M.A., Ph.D.,
Vice-Chancellor

Lalitha Kala Kshetram,
Public Gardens, Nampally,
Hyderabad - 500 004. (A.P.)

# టూ ఇన్ వన్

కావ్యంలో వక్రత వంటిది - ధ్వని విన్యాస కళలో 'మిమిక్రీ'. మిమిక్రీ అనువాద కావ్య ప్రక్రియ లాంటిదే. మూలం ఒకటి ఉంటే దానిని మరొక భాషలోనికి మార్చటం అనువాదం. మూలభాషకు 'ఒక పలుకు తీరు' ఉంటుంది. అనువాద భాషకు 'మరొక పలుకుబడి' ఉంటుంది. మూలభాషకు అనువాద భాషకుండే పలుకుబడిలోకి మార్చే అనుభవ ప్రక్రియ 'అనువాదం'. మిమిక్రీ కూడా అటువంటిదే. అయితే ఇందులో ముఖ్యంగా మూలానుకరణమే ఉంటుంది. మిమిక్రీ కళాకారుడు పశుపక్ష్యాదులను అనుకరించేటప్పుడు అనుసరిస్తాడు. యాంత్రిక శబ్దాలను అనుకరిస్తాడు. మనుషులను అనుకరించవచ్చు, అనుసరించవచ్చు, పారడీగా ప్రదర్శించవచ్చు, లేదా అనుసృజనం కూడా చేయవచ్చు. ఒక్కొక్కసారి ఈ నాలుగింటినే కలిపి ఒక మిశ్రరూప సృజనాత్మకతను ప్రదర్శించవచ్చు. అట్టి మిశ్రరూప సృజనాత్మకతకు బాగా తోడ్పడేది వెంట్రిలాక్విజమ్ (మాట్లాడే బొమ్మ ప్రక్రియ). కళాకారుడు పెదిమలతో పలుకుతాడు. అతడే బొమ్మగా పెదిమలు కదపకుండా కడుపులోనుంచి మాట్లాడతాడు. ఇదొకరకంగా ద్విపాత్రాభినయం లాంటిది. ఇందులో మూలంకంటే ఒక చమత్కార సృష్టి అధికంగా ఉంటుంది. మూలాన్ని చమత్కార వక్రతతో ధ్వని విన్యాసంలో ప్రదర్శించటం. మిమిక్రీలో ఒక స్పెషలైజేషన్‌గా కనబడుతుంది. ఈ గ్రంథం ఆ శాఖకు పట్టుకొమ్మ.

ధ్వన్యనుకరణలో ఎన్ని ప్రత్యేకతలున్నాయో అన్నిటికీ నాటి పరిణత రూపాలను తెలుగువారికి అందించిన ధ్వన్యనుకరణ సమ్రాట్ డాక్టర్ నేరెళ్ల వేణుమాధవ్‌గారు. వారివద్ద శ్రీ వై. పరమేశ్వరరావుగారి వద్ద శిక్షణ పొందిన శ్రీ బొమ్మ శ్రీనివాస్ గారు స్వయంగా 'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ' అయ్యారు. ఆ కళను శాస్త్రీయంగా అధ్యయనం చేసిన శ్రీ శ్రీనివాస్‌గారు దాని శాస్త్రీయతను తెలిపే గ్రంథాలు రచించారు. వీరు రచించిన 'మిమిక్రీ..... మిమిక్రీ...' అనే గ్రంథం ధ్వన్యనుకరణానికి సామాన్యశాస్త్ర గ్రంథం. అందులో 'ఆటబొమ్మ' శాఖకు ఈ గ్రంథం ప్రత్యేక పాఠ్యగ్రంథం. కళా ప్రదర్శనం కలకాలం తరతరాలుగా సాగుతూ ఉండాలంటే ప్రదర్శన పరిజ్ఞానంతో పాటు, దాని శాస్త్రీయ పరిజ్ఞానం కూడా ముఖ్యం. విశ్వవిద్యాలయ స్థాయిలో అధ్యయన, అధ్యాపనలలో ఉన్న 'మిమిక్రీ' కి ఈ గ్రంథం ఎంతో ఉపకరిస్తుంది. మిత్రులు బొమ్మ శ్రీనివాస్ ఈ శాఖలో తన బొమ్మను శాశ్వతంగా నిలుపుకున్నారు. అందుకు నా అభినందనలు.



## 'అంపశయ్య' నవీన్
నవలా రచయిత

# మిమిక్రీ కళకు అక్షరరూపం

ఒకప్పుడు మిమిక్రీ - లేక - ధ్వని అనుకరణ అనగానే నేరెళ్ల వేణుమాధవ్ ఒక్కడే గుర్తొచ్చేవాడు. కానీ ఇప్పుడు మిమిక్రీ కళాకారుల సంఖ్య గణనీయంగా పెరిగింది. నేరెళ్ల వేణుమాధవ్‌గారి శిష్యులు ఆ కళలో ఎన్నో నూతన ప్రయోగాల్ని చేస్తూ ప్రేక్షకుల హృదయాల్ని రంజింపజేస్తున్నారు. అలా మిమిక్రీ కళను ఎంతో సుసంపన్నం చేస్తూ ఆ కళను ఎంతో ముందుకు తీసుకెళ్తున్న వర్ధమాన కళాకారుల్లో బొమ్మ శ్రీనివాస్ పేరును ప్రత్యేకంగా పేర్కొనాలి.

బొమ్మ శ్రీనివాస్ మిమిక్రీ ప్రదర్శనలివ్వడమే కాకుండా ఆ కళను గూర్చి పుస్తకాలు కూడా రచిస్తున్నారు. ఇప్పటి వరకు మిమిక్రీ కళను గూర్చిన పుస్తకాలు ఇంచుమించు లేనేలేవని చెప్పాలి. ధ్వని అనుకరణ కళను చతుష్షష్టి కళల్లో ఒకటని చెప్పడమే గానీ ఆ కళను గూర్చి ఆ కళ లక్షణాలను గూర్చి వ్యాసాలు గాని, పుస్తకాలు గానీ రాసిన వాళ్లెవరూ లేరు. ఈ విషయంలో మిమిక్రీ కళకొక సిలబస్ తయారుచేసి ఆ కళకొక ప్రామాణికతను మొట్టమొదటిసారిగా కల్పించినవాడు నేరెళ్ల వేణుమాధవ్. ఆ తర్వాత ఈ రంగంలో అంటే మిమిక్రీ కళకు సంబంధించిన రచనారంగంలో కృషి చేస్తున్న వాళ్లలో బొమ్మ శ్రీనివాస్ ఒక్కడే కనిపిస్తున్నాడు. బొమ్మ శ్రీనివాస్ ఇదివరకే 2000వ సంవత్సరంలోనే "మిమిక్రీ - మిమిక్రీ" పేరుతో ఒక పుస్తకాన్ని ప్రచురించాడు. ఆ పుస్తకం రెండేళ్లలోనే మూడు ముద్రణల్ని పొందింది. ఈ పుస్తకంలో బొమ్మ శ్రీనివాస్ మిమిక్రీ కళకు సంబంధించిన అనేక అంశాల్ని సాధికారికంగా, సోదాహరణంగా, ఔత్సాహిక కళాకారులకు ప్రయోజనకరంగా చర్చించాడు.

ఇప్పుడు "మిమిక్రీ పాఠాలు" అనే పేరుతో శ్రీనివాస్ తన రెండో పుస్తకాన్ని వెలువరిస్తున్నాడు. ఈ పుస్తకంలో ఆయన మిమిక్రీ కళను అభ్యసించే ఔత్సాహికులకు ఉపయోగపడే ఎన్నో కళాసూక్ష్మాల్ని పొందుపరచాడు.

ఈ పుస్తకంలో మిమిక్రీ కళాకారులు తమ ప్రదర్శనల్లో చెప్పదగిన కొన్ని జోక్స్‌ని చేర్చాడు. ప్రేక్షకుల్ని కాస్సేపు నవ్వించడం మిమిక్రీ కళ ముఖ్య ఉద్దేశ్యం. ఈ పుస్తకంలో చేర్చిన జోక్స్‌లో వినోదంతోపాటు మంచి సందేశాలు కూడా ఉండటం మనం గమనించవచ్చు. ఈ జోక్స్‌ని ఒక సమర్థవంతుడైన మిమిక్రీ కళాకారుడు చెప్పినపుడు ప్రేక్షకులు కడుపుబ్బ నవ్వుతారు. శ్రీనివాస్ సృష్టించిన జోక్స్ అన్నీ బావున్నాయి.

ఈ జోక్స్‌లో ఎక్కడా అశ్లీలాలు గానీ, అసహజత్వంగానీ కనిపించవు. ఈ జోక్స్‌లో "అడ్వర్టయిజ్‌మెంట్స్" మీద రూపొందించబడిన జోక్స్ మరీ బావున్నాయి. జోక్స్‌కూడా వాస్తవికతను ఆధారం చేసుకొని సృష్టించబడినప్పుడే రక్తి కడ్తాయి. మనం మన దైనందిన జీవితంలో చూస్తున్న వ్యక్తుల్నే, సంఘటనల్నే ఆధారం చేసుకొని, వాటికి కొంచెం అతిశయాన్ని జోడించి జోక్స్‌ని సృష్టించాలి. ఒక జోక్‌ని విన్నపుడు ఇట్లా కూడా జరగడానికి అవకాశం ఉందని విన్నవాడికి అనిపించాలి. వాస్తవ జీవితంతో ఏమాత్రం కూడా సంబంధం లేకుండా సృష్టించబడే జోక్స్ పెద్దగా రక్తి కట్టవు. శ్రీనివాస్ ఈ పుస్తకంలో చేర్చిన చాలా జోక్స్ వాస్తవ జీవితాన్ని ఆధారం చేసుకొని సృష్టించబడినవే. ఒక సమర్థుడైన మిమిక్రీ కళాకారుడు ఈ జోక్స్ ఆయా సన్నివేశాలకు, వ్యక్తులకు సంబంధించిన ధ్వనుల్ని అనుకరిస్తూ ప్రదర్శించినప్పుడు వాటి ప్రభావం ప్రేక్షకుల మీద చాలా బలంగా ఉంటుంది.

ఈ పుస్తకంలో "మాట్లాడే బొమ్మ" ను గూర్చిన అధ్యాయం చాలా ప్రయోజనకరంగా రూపొందింది. ఈ "మాట్లాడే బొమ్మ" విషయంలో బొమ్మ శ్రీనివాస్ చేసిన ప్రయోగాల ప్రదర్శనలు చాలా రక్తి కట్టాయి.

మిమిక్రీ కళాకారుడు పెదవుల్ని కదలించకుండా కడుపు ఆధారంగా మాట్లాడుతూ బొమ్మే మాట్లాడుతున్న భ్రమను ప్రేక్షకులకు కల్గిస్తాడు. ఎంతో సాధన చేస్తే తప్ప ఈ మాట్లాడే బొమ్మను ప్రేక్షకులముందు మిమిక్రీ కళాకారుడు ప్రదర్శించలేడు. ఇలా కడుపు సహాయంతో పెదవుల్ని కదిలించకుండా సాధన చేయాలంటే యేంచెయ్యాలో శ్రీనివాస్ ఈ పుస్తకంలో "వెంట్రిలాక్విజమ్" కళలోని అనేక మెలకువల్ని ఔత్సాహిక కళకారులకు స్పష్టంగా ఈ రచన ద్వారా తెలియజేశాడు. మిమిక్రీ కళలో రాణించాలనుకునే ఎందరో ఔత్సాహికులకు ఈ పుస్తకం ఎంతో తోడ్పడుతుందనడంలో ఎలాంటి సందేహంలేదు.

మిమిక్రీ కళను ప్రదర్శించి ప్రశంసల్ని పొందటంతోటే తృప్తిపడకుండా, ఆ కళానియమాలకూ, ఆ కళలోని అనేక సూక్ష్మాంశాలకూ అక్షర రూపం కూడా ఇవ్వాలని, మిమిక్రీ రంగంలో ఎంతోమందికో ప్రయోజనకరంగా ఉండే సాహిత్యాన్ని సృష్టించాలని ప్రయత్నిస్తున్న చి॥ బొమ్మ శ్రీనివాస్‌ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. భవిష్యత్తులో ఆయన ఈ కళలో ఇంకెన్నో ఉన్నత శిఖరాల్ని అధిరోహించాలని ఆకాంక్షిస్తున్నాను.

2-7-71, ఎక్సైజ్ కాలని,
హన్మకొండ,
వరంగల్ - 506 001.

-నవీన్

*With best compliments from*



**MJF Ln. N.S. JOHAR**
(CM, PP, PZC, PRC)

12-109, Johar Cresent,
Alwal, SECUNDERABAD - 10.
Ph: 7791939 (R), 7973735 (O)



**Dr. V. SURYANARAYANA**
M.Sc., M.Phil., Ph.D.
**Reader & Head**
Department of Physics
L.B. College, WARANGAL.

# 9-1-110, Girmajipet, WARANGAL - 506 002.
☎ 560248 (R)

**TRIPURANENI GOPICHAND**
B.Com., LL.B., FCA
**CHARTERED ACCOUNTANT**
# 8-12-52, J.P.N. Road, WARANGAL.
☎ 425559 (S), 426200 (R),





**Ln. MARGAM SHANKER**
Founder President,
Dasara Uthsava Committee, Kareemabad, Warangal.
President, Warangal City Book Sellers Association
**RAVI BOOK STALL**
# 4-9-173, Chowrastha, HANAMKONDA.
☎ 577574, 578039. Cell: 98490 58553

# విషయసూచిక



# ఆకాశవాణి కార్యక్రమాలు
# Radio Programmes

మానవకోటికి విజ్ఞాన శాస్త్రం అందించిన అద్భుతమైన కానుక రేడియో. కొన్ని దశాబ్దాల నుండి విశ్వాంతరాలంలో అనుక్షణం జరుగుచున్న సంఘటనల్ని కళ్లకు కట్టినట్లు వివరించే అద్భుతమైన సాధనం 'ఆకాశవాణి'. ఇది అనేక సంవత్సరాల నుండి మానవ మేధస్సుకు ప్రతీకగా నిలవడమే కాకుండా విజ్ఞాన శాస్త్రాన్ని అభివృద్ధి పరచడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ మానవాళికి సహకరిస్తూ నాటికీ, నేటికీ, ఏనాటికీ మానవునికి "అరచేతిలో విశ్వం" లా ఉపయోగపడే విశ్వసాధనం.

మానవుడు తన అవసరాలకనుగుణంగా ఆయా కార్యక్రమాల్లను రూపకల్పన చేసి రేడియో ద్వారా ప్రసారం చేస్తూ వస్తున్నాడు. ఉదయం ఆరు గంటలకు ప్రసారమయ్యే సుప్రభాతం మొదలు రాత్రి పది గంటల్లకు ప్రసారమయ్యే చిత్రసీమ వరకు అనేక రకాల కార్యక్రమాలను మిమిక్రీతో మేళవించి రసజ్ఞులైన కళాభిమానులను మరియు వర్థమాన మిమిక్రీ కళాకారులను ప్రభావితం చేసేవిధంగా సందేశాత్మకంగాను, వినోదాత్మకంగానూ అనేక రకాలైన హాస్యభరిత కార్యక్రమాలను రూపొందించి, సమర్పించినప్పుడు మిమిక్రీకి సంబంధించిన ఒక విన్నూతమైన ప్రక్రియ అంకురిస్తుంది.

## 1. ఈ రోజు మా ప్రసార విశేషాలు

ఆకాశవాణి హన్మకొండ కేంద్రం. 000 ఫ్రీక్వేన్సీ పై 12345 బ్యాండ్‌పై ఈ రోజు ప్రసారమయ్యే మా కార్యక్రమాల వివరాలు దయచేసి వినండి. ఎవరూ పారిపోవద్దు!

ఉదయం 6 గంటలకు : సూపర్‌భాతం

7 గంటలకు : వార్తలు

8 గంటలకు : బ్రేక్‌ఫాస్ట్‌లో మనుష్యులతో మాట్లాడడమెలా?

9 గంటలకు : వి'చిత్రసీమ'

10 గంటలకు : అత్త - కోడలు 'దొందూదొందే' నాటిక

మధ్యాహ్నం 12 గంటలకు : 'బిర్లా బిక్షగాడు - టాటా కుష్టు వాడు' ద్విపాత్రాభినయం

ఒంటి గంటకు : పాడి పంటలు కార్యక్రమంలో ఒలంపిక్స్ గురించి చర్చ

2 గంటలకు : ఉషశ్రీ సమాధానాలు

3 గంటలకు : 'తలాంతు... తకధిమితోం' భరతనాట్యం

సాయంత్రం 5 గంటలకు : తిరుపతిలో జరుగుచున్న దొంగజనాలపై భక్తి పాటలు

6 గంటలకు : 'జీన్స్ పాంట్‌లో జెర్రి' నాటకం

7 గంటలకు : 'ఏం వదినా పని అయ్యిందా?' స్త్రీల కార్యక్రమం

8 గంటలకు : నరుకుతా నాగుండే.. చిత్ర సమీక్ష

9 గంటలకు : కుంటివాళ్లు నడువవచ్చు... గుడ్డివాళ్ళు చూడవచ్చు వింత కార్యక్రమం.

10 గంటలకు : ఇంటికిపోయి పడుకోవడం ఎలా?

## 2. మాడ్రన్ సూపర్‌భ్రాతం

ఈ 21వ శతాబ్దంలో సినీ తారలు రాజకీయ నాయకులుగా మారుతున్న నేపథ్యంలో ఈ దేశం రానున్న 22వ శతాబ్దంలోకి ప్రవేశించినపుడు సినీ తారల జీవిత చరిత్రలు పిల్లలకు పాఠాలుగా వస్తాయనడంలో అతిశయోక్తి లేదు. మరి అప్పుడు సుప్రభాతం కూడా ఎలా ఉంటుందో... ఊహించి ఇక్కడ సినీ తారల పేర్లతో వ్రాయడం జరిగింది సుప్రభాతం తరువాత భార్యాభర్తలు ఎలా మాట్లాడుకుంటారో చూద్దాం.

గమనిక :- యం.ఎస్. సుబ్బలక్ష్మి గారి... కౌసల్య సుప్రజారామ పూర్వ సంధ్యా ప్రవర్తతే... తరహాలో ప్రాక్టీస్ చేయాలి.

శ్రీదేవి శ్రీవిద్య శ్రీలక్ష్మి విజయలక్ష్మి
శ్రీప్రియ శ్రీలత లక్ష్మి జయలక్ష్మి
జయప్రద, జయసుధ, జయచిత్ర, విజయశాంతి
రాధా, రంభ, రవళి, నగ్మా, సౌందర్య...

భార్య : అబ్బబ్బబ్బ... ఏమండి పూజ అయిపోయింది. మీకు రమ్ము తేవాలా? విస్కీ తేవాలా?

భర్త : రాత్రి ఆ దేశవాళీ రమ్ముతాగి దిమ్మ తిరిగిపోయింది. పొద్దున్నే ఆ రమ్మొద్దు గాని విస్కీ తీస్కోనిరా!

భార్య : ఇదిగోండి... విస్కీ

భర్త : శభాష్..... మరీ నువ్వు తాగావా?

భార్య : ఉదయం 5 గంటలకే నా రమ్ము నేను తాగేశానండి.

భర్త : డాక్టర్ గారు రోజు 3 సార్లు తాగమన్నారు మరిచిపోయేవు సుమా....? మరి నేను అలా కబ్ల్ వరకు వెళ్లొస్తా.

## 3. సంస్కృత వార్తలు

ఇయం ఆకాశవాణి సంప్రతి వార్తాః శూయంతాం ప్రవాచకః బలదేవనంద సాగరః

గత సాయంత్రం ఢిల్లీ మహానగరం కురుక్షేత్ర మహాసంగ్రామం భీకర పోరాట యానం అశ్వద్ధామః అతః పుంజరః. ఇతి వార్తాః

## 4. ఉర్దూ వార్తలు

యే ఆకాశ్‌వాణి హై! అబ్ ఆప్ కబరస్థాన్‌సే ఇలాఖాయీ ఖబ్రే సునియే!

కల్ రాత్ లగ్ భగ్ సాడే ఆఠ్‌బజే ఏక్ సైకిల్ వాలానే ఏక్ లారీ వాలేకో టక్కర్ దియా. లారీ టుక్‌డే టుక్‌డే హోగయా! సాలా సైకిల్ వాలా బచ్‌గయా.

## 5. ఆకాశవాణిలో పని చేస్తున్న ఇద్దరు ప్రేమికుల సంభాషణ

ఒక్కొక వ్యక్తికి ఒక్కొక్క మ్యానరిజం (అలవాటు) ఉంటుంది. ఆ అలవాట్లు, మాట్లాడే తీరు వారు పని చేస్తున్న సంస్థ, వ్యక్తులు, అక్కడి వాతావరణం మీద ఆధారపడి వుంటాయి. ఇక్కడ రేడియో స్టేషన్‌లో పని చేస్తున్న ఇద్దరు ప్రేమికుల సంభాషణ వారి అలవాట్లు వివరించడం జరిగింది.

శ్రీను : లతా! 'అనివార్య కారణాల' వల్ల నిన్ను పెళ్లి చేస్కోలేక పోతున్నాను. అందుకు ఎంతగానో 'చింతిస్తున్నాను.'

లత : ఈ 'వాతావరణంలో' ఇంతకన్నా చెప్పకోదగ్గ మార్పు ఉండదా శ్రీను!?

శ్రీను : లేదు లతా... ' ఈ ప్రసారం ఇంతటితో సమాప్తం'.

## 6. తెలుగు వార్తలు

**ఆకాశవాణి వార్తలు చదువుచున్నది కందుకూరి సూర్యనారాయణ:**

ఆబిడ్స్‌లో నిన్న జరిగిన రోడ్డు ప్రమాదంలో ఇద్దరు వ్యక్తులతో పాటు 100 దోమలు, 80 ఈగలు అక్కడికక్కడే మరణించాయి. ఇంతపెద్ద యాక్సిడెంట్ ఒక కాకి, లారీకి అడ్డు రావడం వలన జరిగిందని అక్కడ చూసినవారు చెప్పగా పలువురు ముక్కు మీద వేలెస్కొన్నారు. కాగా రాష్ట్రంలో జరిగిన అల్లర్లకు రాష్ట్రమంత్రి నెత్తిన గుడ్డేస్కొన్నారు.

## 7. ప్రయాగ రామకృష్ణ

**ఆకాశవాణి వార్తలు చదువుచున్నది ప్రయాగ రామకృష్ణ:**

ప్రఖ్యాత సినీ రచయిత కసి గుర్నాధం నిన్న రాత్రి 9 గంటలకు బాంబు ప్రమాదానికి గురైనారు. ఆయన తింటున్న వంకాయ కూరలో ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు బాంబు పెట్టారని అది బాంబని తెలియక కొరకడం వలన ఈ ప్రమాదం జరిగిందని వారి సమీప బంధువులు తెలిపారు. ఆయన ఇంకా కసితో మనకు కథలు రాయవలసిన ఖర్మ, దౌర్భాగ్యం మనకు ఉన్నాయి కాబట్టి ఆయన బ్రతికి బట్టకట్టారని డాక్టరు గారు ఒక ప్రకటనలో పేర్కొన్నారు.

## 8. డి. వెంకట్రామయ్య

**ఆకాశవాణి వార్తలు చదువుచున్నది డి. వెంకట్రామయ్య:**

ఈ రోజు జరిగిన క్రికెట్ మ్యాచ్‌లో ఆస్ట్రేలియా అలవాటు ప్రకారం ఓడిపోయింది. ఈ మ్యాచ్ ఓడిపోవటానికి గల కారణం ఏమిటని కెప్టెన్ కంగారుని అడగ్గా, తను బ్యాటింగ్ చేస్తుండగా చప్పట్లు కొట్టలేదని, చప్పట్లు కొట్టనిదే తను ఆడలేనని ఒక ప్రకటనలో పేర్కొన్నాడు.

## 9. వాతావరణ సూచన

వాతావరణం ఏ టైముకు ఎలా ఉంటుందో చెప్పడం చాలా కష్టం. కాని పగలు వెలుతురు గాను. రాత్రి చీకటిగాను ఉంటుందని ఖచ్చితంగా చెప్పవచ్చు. కరెంట్ పోతే ఆకాశంలోని నక్షత్రాలన్నీ చక్కగా చూడొచ్చు. ఇప్పటి వరకు మాకు అందిన గరిష్ఠ ఉష్ణోగ్రత తెలియలేదు. కనుక, కనిష్ఠం తెలిసే ప్రసక్తే లేదు.

గాలిలో తేమ నూటికి నూరు శాతం ఎప్పుడూ వుండదు. ముఖ్యంగా వర్షం ఎక్కడ పడుతుందో అక్కడ బురద అవుతుంది.

## 10. రెండు రేడియో స్టేషన్స్ మిక్స్ అయితే...?

ఒక్కొక్కసారి మనం రేడియో పెట్టినపుడు రెండు పక్క పక్క స్టేషన్లు కలుస్తుంటాయి. "ఎ" స్టేషన్‌లో 'చర్మ సౌందర్యం' గూర్చి ఒక అమ్మాయి, "బి" స్టేషన్‌లో 'పశువుల పోషణ' గురించి ఒక అబ్బాయి చెబుతున్న విషయాలు ప్రసారం అవుతుంటాయి. ఈ ఎ,బి. స్టేషన్స్ మిక్స్ అయి అది కొంత, ఇది కొంత వినబడుతున్న విషయాన్ని సరదాగా హాస్యం కోసం ఇలా క్రియేట్ చెయ్యవచ్చు.

అమ్మాయి : ముందుగా మీరు నిద్రలేవగానే

అబ్బాయి : గట్టిగా రంకెవేసి

అమ్మాయి : స్నానానికి ఉపక్రమించాలి మొదట మీ శరీరాన్ని

అబ్బాయి : గడ్డిపెట్టి గట్టిగా రుద్దుతూ

అమ్మాయి : మధ్య మధ్యలో

అబ్బాయి : కొబ్బరి పీసుతో రుద్దాలి

అమ్మాయి : అలా చేయడం వలన మీ శరీరం

అబ్బాయి : నల్లగ నిగనిగ లాడుతూ ఉంటుంది.

అమ్మాయి : ఆ తరువాత మీ నెత్తి మీద

అబ్బాయి : పేడవేసి

అమ్మాయి : రుద్దుకోవాలి ఆ తరువాత జుట్టును

అబ్బాయి : ఒక చెట్టుకు కట్టివేయాలి.

అమ్మాయి : ఇంకా తిండి విషయంలో

అబ్బాయి : గడ్డి, తౌడు, తింటూ కుడిది తాగాలి

అమ్మాయి : సాయంత్రం అలా షికారు చేస్తూ

అబ్బాయి : చెత్త కుప్పలవెంట మురుగు కాలువల వెంట తిరగాలి.

## 11. ఉషశ్రీ సమాధానాలు

శ్రోతలు ఉత్తరాల ద్వారా వెలిబుచ్చిన ధర్మ సందేహాలకు ఉషశ్రీ గారు రేడియో ద్వారా సమాధానం ఇవ్వాలి కాబట్టి తప్పని సరై ఆయన సమాధానాలు ఇలా ఇస్తుంటారు.

**1. పశ్న :** అయ్యా గురువు గారు... రంకులపాలెం టెంకలూరు నుండి అనిత, సునిత, రజిత, హరిత అడుగుచున్నారు. వారి తలల్లో చాలా పేలు ఉన్నాయట. ఈ పేలన్నీ పోవాలంటే ఏం చెయ్యాలని అడుగు చున్నారు.

**జవాబు :** శ్రీ గురుభ్యోనమః చూడమ్మా అనిత, కవిత, రజిత, సునిత ఈ పేలు ఇప్పటి నుండి కాదు కదా, త్రేతాయుగం అనగా రామాయణ కాలం నుండి ఉంటున్నాయి. ఈ పేలన్నీ చచ్చిపోవాలంటే కాస్తంత చక్కరపాకం గానీ, బెల్లం పాకం గానీ పట్టి, తలపై పోసుకున్నట్లయితే ఈ పేలన్నీ చచ్చిపోతాయి. అప్పటికీ చచ్చిపోనట్లయితే రాత్రి మీరు పడుకున్నాకా ఈ పాకాన్ని తినటానికి కొన్ని చీమలు వస్తాయమ్మ. అప్పుడు ఈ చీమలకు పేలకు మధ్య భారీ యుద్ధం జరుగుతుంది. అప్పుడు పేలన్నీ ఖచ్చితంగా చచ్చిపోతాయ్.

**2. ప్రశ్న :** అయ్యా గురువు గారు! పోయిన వారం మీరు విన్పించిన విరామ సంగీతం చాలా బాగుంది. దాన్ని మరల మరల విన్పించమని వరంగల్ నుండి మామిడాల వేణుగోపాల్ కోరుచున్నారు. దీనికి మీరెమంటారు.

**ఉషశ్రీ :** చూడు నాయనా! అదేమిటంటే ఇటీవల మనం విన్పించినది విరామ సంగీతం అనుకుంటున్నారు. క్షమించాలి. అది విషాద సంగీతం అని గమనించాలి. అది పెద్ద పెద్ద దేశ నాయకులు చనిపోయినప్పుడు విన్పిస్తుంటాము. దానిని మరల మరల విన్పించమన్నారు. నీ ఉద్దేశ్యం నాకు అర్థమయ్యింది. కాని అది మంచిది కాదు నాయనా.

## 12. వి'చిత్ర సీమ'

విచిత్ర సీమ. మీరు కోరినపాటలు ముందుగా జగదేకవీరుని కథ చిత్రం నుండి ఘంటసాల పాడిన పాట. కోరిన శ్రోతలు. హన్మకొండ మండలం ఆరెపల్లి నుండి .... మహేశ్, రమేశ్, పరమేశ్, సురేశ్, రాజేశ్, దినేశ్, అవినాశ్, వెంకటేశ్, నటేశ్, అభిలాష్, అన్వేష్.... ఇంకా ఈ ఉశ్ శ్ శ్....... అన్నలందరూ కోరినపాట.

పాట : మ్ము.... మ్ము.... మ్ము... ముద్దంటే చేదా? నీకా ఉద్దేశ్యం లేదా?

రేడియో : క్షమించాలి ఇప్పుడు కరెక్ట్‌గా వింటారు.

పాట : శివశంకరీ... శివానందల ... ల.. ల... ల... ల... ల...

## 13. అరిగిపోయిన రికార్డు

విచిత్ర సీమ మీరు కోరిన పాటలు

గూడూరు నుండి బ్రూసిలి, గుంటూరు నుండి రోగర్‌మోర్, సింగపూర్ నుండి పూలన్‌దేవి, బెజవాడ నుండి గోర్బచేవ్, సిలోన్ నుండి స్మిత, ఆస్ట్రేలియా నుండి కపిల్‌దేవ్, కోయంబత్తూరు నుండి స్టెఫీగ్రాఫ్ మొదలగు వారు కోరిన పాట "అభిలాష" చిత్రం నుండి బాలు, జానకి ఆడుకొని కావాలని పాడుకొన్న పాట. సంగీతం ఇళయ'రోజా'.

**పాట :** నచ్చింది మల్లె చెండు<br>
వచ్చింది గర్ల్‌ఫ్రెండ్<br>
దొరికెరా... భలేగ చాన్సు<br>
జరుపుకో... జరుపుకో.... జరుపుకో....<br>
(రికార్డు జరిపే వరకూ అలాగే అంటుంది.)

## 14. చిత్రసీమ

వంకాయరావు, బెండకాయరావు, పాలకూరక్క, సుక్కకూరక్క, క్యాబేజి వర్మ, పుల్లగంద సక్సేనా, క్యారెట్, ఉల్లి, మల్లి, మొదలగు వారు కోరినపాట శ్రీదేవి, యస్.వి. రంగారావు నటించిన "ఉహూఁ... వద్దండి ప్లీజ్" చిత్రం నుండి నువ్వూ నేను పాడిన పాట.

బొమ్మ శ్రీనివాస్

**పాట :**

శ్రీదేవి : ఉల్లిగడ్డ తోటలో ఏం ఉంది? ఏం ఉంది?

యస్‌వి. రంగారావు : పొట్టుంది, ఉల్లి పొట్టుంది.

## 15. వింత వార్తలు

అవకాశవాణి వార్తలు చదువుచున్నది "పేరెందుకు లెండి అనవసరం". వార్తలు వింటున్నప్పుడు ప్రతి ఒక్కరు శ్రద్ధగా వినాలి. ఎందుకంటే చెప్పబోయే వార్తలు ఒకదానికి ఒకటి సంబంధం వుండదు.

రామారావు, లక్ష్మీపార్వతితో మాట్లాడుతూ..... "చచ్చిపోయిన నాతో అనవసరంగా మాట్లాడొద్దు" అన్నారు.

రాజమండ్రిలో 3 పడకల ఎయిడ్స్ రోగుల ఆస్పత్రికి పల్లికాయల అరుణ ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంగా ఆవిడ ప్రసవిస్తూ... 3 పడకల ఆస్పత్రి 30 పడకలుగా అభివృద్ధి చెందాలని ఆశాభావం వ్యక్తం చేశారు.

## 16. కూరగాయల ధరలు

**వంకాయలు** : కాకినాడలో 1 కిలో 60 రూపాయలు
వరంగల్‌లో 20 రూపాయలు
మా దగ్గర ఫ్రీగా ఇస్తున్నారు.

**బెల్లం** : ముద్ద బెల్లం కిలో 10 రూపాయలు
ఈగలు ముసిరినది కిలో 20 రూపాయలు

**బెండకాయలు** : కిలో 5 రూపాయలు
ముదిరినవి 20 రూపాయలు

**టమాటాలు** : కిలో 2 రూపాయలు
పుచ్చిపోయినవి 20 రూపాయలు

## 17. రేడియో చెడిపోయినపుడు వార్తలు

రేడియోలో వార్తలు వింటున్నప్పుడు, వాతావరణం బాగాలేక మధ్యలో అప్పుడప్పుడు గర్ర్ర్... మనీ, కుయ్... మనీ శబ్దాలు వస్తూ ఉంటాయి. అప్పుడు అక్కడ ఏ వార్త వచ్చిందో తెలియక ఆందోళన పడుతుంటాము. ఇలాంటి సందర్భాన్ని ఆసరాగా తీస్కొని క్రియేట్ చేస్తున్న హాస్యవార్తే ఇది.

"ఆకాశవాణి వార్తలు చదువుచున్నది.... గర్ర్ర్ భారత్ ప్రధాని నేడు లోక్‌సభలో మాట్లాడుతూ కుయ్.... అన్నారు. దీనికి సమాధానంగా ప్రతిపక్ష నాయకులు మాట్లాడుతూ కుయ్... క్రైయ్ అని సమాధాన మిచ్చారు".

రాష్ట్ర ముఖ్యమంత్రి పీసు చంద్రబాబునాయుడు నేడు సరస్వతి పార్వతిని కలుసుకుంటారు. వారు ఈ రోజు రాత్రి కాంగ్రేస్ భవనంలో గర్ర్ర్ర్.......చేస్కొంటారు.

(ఫైల్ల మీద సంతకాలు చేస్కొంటారు. అది మనకు వినిపించలేదు.)

Voice ఉన్న Item No. 3,4,6,7,8,11
(వీటిని వారి గొంతుతోనే చెప్పాలి.)
Voice లేని Item No. 1,2,5,9,10,12,13,14,15,16,17
(వీటిని మీ ఇష్టమైన గొంతులో చెప్పుకోవచ్చు.)




# ప్రకటనలు
# Advertisement's

రేడియోలో అనేక రకాల (ప్రకటనలు) అడ్వటైజ్‌మెంట్స్ వస్తుంటాయి. ఒకప్పుడు పాటల మధ్య అడ్వర్‌టైజ్‌మెంట్స్ వస్తే, ఇప్పడు అడ్వటైజ్‌మెంట్స్ మధ్య పాటలొస్తున్నాయనడంలో అతిశయోక్తి లేదు. ఈ మధ్య కాలంలో ఈ అడ్వర్‌టైజ్‌మెంట్స్ మరీ ఎక్కువై పోయాయి. ఒకటి చూపిస్తారు మరేదో అనౌన్స్ చేస్తారు. ఒకదానికొకటి సంబంధం ఉండదు.

ఈ వెల్లువెత్తే ప్రకటనల వల్ల నష్టాలునష్టటికిని లాభాలు కూడా అధికంగా ఉన్న విషయం మనందరం గమనించాలి. ఒక వస్తువును తయారు చేసిన వాడి కంటే అమ్మినవాడే తెలివైనవాడు. అతి సామాన్యుడు కూడ ఒక వస్తువు గూర్చి తెలుసుకొని కొనగలుగు తున్నాడంటే దానికి కారణం అడ్వటైజ్‌మెంట్స్ మాత్రమే. వ్యాపారాభివృద్ధి దృష్ట్యా ఈ అడ్వటైజ్‌మెంట్స్ ప్రాముఖ్యత పెరుగుచూ కొత్త పుంతలు తొక్కుచున్నది.

జన బాహుళ్యంలో ఎక్కువ ప్రచారంలో ఉన్న అడ్వటైజ్‌మెంట్స్‌ని ఆధారంగా చేస్కొని మిమ్ముల్నందరిని కడుపుబ్బా నవ్వించటానిక్ అనేక హాస్య సన్నివేశాలను సృష్టించడం జరిగింది.

**(గమనిక: కొన్ని పేర్లను హాస్యం కోసం కావాలని తప్పుగా పేర్కొనడం జరిగింది)**

## 1. రామాయణం

భాగవతంలో భక్తి
భాగవతానా యుక్తి
రామకథే రక్తి
ఎందుకు మాకీ సుత్తి

అని మాత్రం అనకండి. రామాయణంలో సీతాదేవి స్వయంవరం సన్నివేశాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ రాముణ్ణి ఇలా ప్రశ్నించింది.

సీతాదేవి : ఏమండీ... నా స్వయం వరంలో అంతశక్తివంతమైన శివధనస్సును ఎలా విరిచారు. మీకు ఆ శక్తి ఎలా వచ్చింది?.

శ్రీరాముడు : 'Booooost' is the secret of my energy.

## 2. ఆర్లిక్స్

ఒక అమ్మాయి పర్సును దొంగిలించిన వ్యక్తి చాలా స్పీడ్‌గా పరుగెడుతున్నాడు.

అమ్మాయి : అయ్యో! దొంగ పట్టుకోండి, పట్టుకోండి

ప్రక్కతను : ఆ దొంగ అంతా స్పీడ్‌గా పరుగెత్తటానికి కారణం 'ఆర్లిక్స్' మీరూ తాగండి ఎన్నో దొంగతనాలు చేయవచ్చు.

ఇది చెప్పిన తరువాత నిజంగా ఎవరైనా తాగేవారుంటే దొంగతనం చేసేరు. పోలీసులు లాకప్‌లో వేసి తంతారు. సరదాగా నవ్వుకోటానికి చెప్పకొన్నామని చెప్పాలి.

## 3. ఫ్రీమోర్

పత్తి - మిరప. మీ పంటలకు ఆకు తెగులు, బంక తెగులు, ఎర్ర నల్లి, తేలుబంక పట్టి పీడిస్తున్నాయా. మీ పంటలు చక్కగా పండాలంటే వాడండి ఫ్రీమోర్. ఫ్రీమోర్ 20-20-0 చివరకు మీాకు మిగిలేది 'గుండుసున్నా'

## 4. హోటల్ రత్న

హోటల్ రత్నలో ఇడ్లీలు బాగుంటాయి అనే అడ్వటయిజ్‌మేంట్స్ ను కంపోజ్ చేసి రేడియోకి ఇచ్చిన్నప్పడు పాటల మధ్య ఇలా ప్రసారం అవుతుంది.

హోటల్ రత్న
గిర్మాజిపేట్,
వరంగల్.

మా హోటల్‌లో ఇడ్లీ తిన్నవారికి సాంబారు ఉచితం.

('గీతాంజలి' చిత్రం లోని ఓప్రియా... ప్రియా... తరహాలో క్రింది పాట పాడాలి.)

ఓ ఇడ్లీ..... ఇడ్లీ
నా చట్నీ..... చట్నీ
సాంబారు బక్కెటలో
మునిగి ఈతలాటలో..... ఉబ్బిపోయి.... తబ్బిపోయి
ప్లేటుల్లోన పై పైకి తేలవే... ॥ఓ ఇడ్లీ... ఇడ్లీ... ॥
హోటల్ రత్న
గిర్మాజిపేట్,
వరంగల్.

## 5. భయం

ఏమిటి? మీ అబ్బాయి ఆటపాటల్లో ఇతరులతో ఆడుకోవడానికి భయ పడుచున్నాడా! వాడికి కావాలి ఎ.కె.-47.

## 6. టార్గెట్ పేస్ట్

టార్గెట్ పేస్ట్‌ని వాడండి.
టార్గెట్ పేస్ట్‌ని వాడండి. ఒక్క పన్నుంటే ఒట్టు
బోసి నవ్వుతో చక్కగా ఉండొచ్చు.
మెత్తని పదార్థాలని సులువుగా తినొచ్చు. టార్గెట్ పేస్ట్‌నే వాడండి.
ఒక్క పన్ను... ఒక్క పన్నుంటే ఒట్టు.

## 7. గజ్జి

భర్త : హోయ్.... బుజ్జి..... బుజ్జి ......

భార్య : అబ్బా ఆగండి.... వాడి ఒళ్లంతా ఒకటే గజ్జి

భర్త : గజ్జి.... తామరకు వాడండి "హోయ్" మందు.

## 8. సిగరెట్టు

నేను చాలా కాలంగా హుహు.... హుహు (దగ్గు...తూ)

ఈ సిగరెట్టు నే వాడుతూ హుహు... హుహు

అందుకే ఈ సిగరెటంటే నాకు చాలా హుహు... హుహు

చూశావా...

దట్టమయిన పొగ, ధారాళమైన దగ్గు

డాక్టర్‌కు డబ్బు, మీ గుండెకు జబ్బు.

## 9. తెలుపు

మొదటివాడు : ఏమిటి మీ షర్టు నా షర్టు కంటే తెలుపా?

ఎలా అబ్బా (ఆశ్చర్యంగా)

రెండవవాడు : నేను రోజు ఉతుక్కుంటాను.

నువ్వు ఉతుక్కోవు.

## 10.గుండు

**గమనిక : త్రీరోజెస్ మోడల్‌లో చెప్పాలి**

మామగారు : నాగుండు గుండ్రంగా గీకాలి సుమా

బావమరిది : నా గుండయితె నున్నగా ఉండాలి

అత్తగారు : నా గుండు తళతళలాడుతూ ఉండాలి.

మరదలు : ఇన్ని రకాల గుండ్లు ఎలా చేస్తావు బావా?

అల్లుడు : అందుకే తెచ్చాగ "తాతా వారి మంగళి కత్తి"

## 11. పాట పాడమని చెప్పు

పాప : హుయ్యాం... హుయ్యాం... అంటూ ఏడుస్తుంది.
అమ్మ : ఏమిటి సంగతి?
నరేశ్ : పాప ఏడ్చింది.
అమ్మ : అయితే పాట పాడమని చెప్పు
అమ్మమ్మ : ఏమిటి సంగతి?
నరేశ్ : పాప ఏడ్చింది
అమ్మమ్మ : పాట పాడమని చెప్పు
అమ్మమ్మ తల్లి : ఏ...మి...టి.... సం...గ....తి...
నరేశ్ : పాప ఏడ్చింది.
అమ్మమ్మతల్లి : పా...ట... పా..డ...మ...ని.... చె...ప్పు.... చిన్నప్పుడు నేను అలాగే చేసేదాన్ని
అమ్మ : గోరింట పూసింది కొమ్మా లేకుండా
మా బాబు పుట్టాడు 'నాన్నా' లేకుండా.

## 12. చార్మినార్ రేకులు

భూమయ్య : ఏమిటి రామయ్యా దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?
రామయ్య : ఆ... ఏమీ లేదు. మా ఇంటికి ఏ రేకులు వేయిస్తే బాగుంటుందా అని
భూమయ్య : దానికి అంతగా ఆలోచించాల్సిన పనిలేదు పక్కింటి రేకులు పీకి వేస్కొంటే పోలా...!
రామయ్య : అవును బాగా చెప్పావు. పక్కింటి రేకులు, ఎదురింటి రేకులు, మీ ఇంటి రేకులు కూడా వేస్కొంటాను.

## 13. ఏమనిపిస్తుంది

గోపి : శాంతా! పుచ్చిపోయిన నీ పళ్లను చూస్తూంటే ఏమనిపిస్తుందో తెలుసా?

శాంత : ఏమనిపిస్తుంది గోపి

గోపి : అదే... పళ్లే ఇలా పుచ్చిపోయియుంటే చిగుళ్లెంత వాచిపోయి ఉంటాయో!

## 14. ఫ్యామిలి ప్లానింగ్

గోపి : శకుంతల! మన పిల్లలేరి?

శకుంతల : మన పిల్లలు మాణిక్యాలండి, మాణిక్యాలు,
మొదటి వాడు కుంటి
రెండవ వాడు గుడ్డి
మూడోవాడికి ఎడ్డి

గోపి : ఆపు శకుంతల ఆపు! నేను ఇప్పడే వాసెక్టమి ఆపరేషన్ చేయించుకొని వస్తాను.

## 15. గోకే సబ్బు

ఎ.కె. వారి
గోకే సబ్బు
3 నెలలు వాడండి.
6 నెలలు గోకండి.
ఆ............
ధర తక్కువ
దురదెక్కువ.

ధ్వన్యనుకరణ యొక్క పురోభివృద్ధి పరిశీలనా శక్తితోపాటు సాధనపై ఆధారపడి వుంటుంది.

-బొమ్మ శ్రీనివాస్



# మాట్లాడేబొమ్మ సంభాషణలు (Ventriloquism)

**"Venter"** అంటే **Stomach. "Loquism** అంటే **do not lips movement but sound is produced.** అంటే పెదవులు కదపకుండా **Stomach** ఆధారంగా మాట్లాడటం అన్నమాట.

మిమిక్రీ వచ్చినవారికి ఈ ఆర్ట్ నేర్చుకోవడం ఏమంత కష్టమైన పని కాదు. ఎందుకంటే గొంతు మార్చి పలకడం వారికి అలవాటైన పని కాబట్టి. ఇటు తను మాట్లాడుతూ మరొకవైపు బొమ్మవలె తానే మాట్లాడవలెను. అంటే చాలా వేగంగా మాట్లాడటంతో పాటు రెండు గొంతు లకు మధ్య స్పష్టమైన తేడా ఉండాలి. అంతేగాని బొమ్మగొంతు ఇలాగే ఉండాలి, ఇలాగే మాట్లాడాలనే రూల్ ఏమీ లేదు. రెండు గొంతుల మధ్య తేడా ఉంటే సరిపోతుంది. అప్పుడు ప్రేక్షకులకు ఇద్దరు మాట్లాడినట్లు స్పష్టంగా తెలుస్తుంది. అలాంటప్పుడే ప్రేక్షకులు పరమానంద భరితులవుతారు. ఈ వెంట్రిలాక్విజమ్ చిన్నపిల్లలను మరింత ఆకట్టుకొంటుంది. అయితే ఈ ఆర్ట్‌కు చిన్న పెద్ద అనే బేధం ఏమీ లేదు. పిల్లలనుండి,పండు ముదుసలి వరకు అందరినీ ఆకట్టుకొంటుంది.

వెంట్రిలాక్విజమ్ ప్రదర్శిస్తున్నప్పుడు చాలా మంది ప్రేక్షకులు బొమ్మలో, టేప్‌రికార్డరో లేదా మైక్రోఫోనో ఉందని భావిస్తారు. ఇప్పటికి మాట్లాడేబొమ్మ ఎలా మాట్లాడుతుందనే విషయం చాలా మందికి తెలియదు.

## వెంట్రిలాక్విజమ్ ఎలా నేర్చుకోవాలి?

కళ 'తపస్సు' లాంటిది. మిమిక్రీ కళకారులు సాధన చేస్తే వెంట్రిలాక్విజమ్ తప్పకుండా వస్తుంది. వెంట్రిలాక్విజమ్ నేర్చుకోవాలంటే క్రింది విషయాలు జాగ్రత్తగా నేర్చుకోవాలి.

1) 'అ' నుండి 'ఱ' వరకు 56 తెలుగు అక్షరాలు.
2) A నుండి B వరకు 26 ఇంగ్లీషు అక్షరాలు.
3) 1 నుండి 100 వరకు అంకెలు.
4) గుణింతాలు.
5) బాలశిక్ష

ఈ విధంగా పైన చెప్పిన 5 విషయాలను కనీసం ఒక నెల రోజులు 'పెదవులు కదపకుండా' ఒకటవ తరగతి చదువుతున్న విద్యార్థివలె నేర్చుకోవాలి. అలా **Practice** చేస్తే ఎవరికైనా ఈ ఆర్ట్ వస్తుంది.

**సూచనలు:**

1) పెదవులను కన్పించి కన్పించనంతగా కొద్దిగా తెరచి ఉంచాలి. ఎందుకంటే పూర్తిగా నోరు మూసి పలికితే మనం ఏం చెబుతున్నామో ప్రేక్షకులకు అర్థం కాదు.
2) వెంట్రిలాక్విజమ్ లో బొమ్మ మాట్లాడే పదాలు నోటి నుండి యే గాక, ముక్కు ద్వారా వచ్చునట్లు పలుకవలెను.
3) రెండు పెదవులను వత్తిపట్టి పలుకుతూ ష,బ,మ లాంటి అక్షరాలు వచ్చినపుడు వాటికి బదులుగా 'క' అని స్పీడ్‌గా పలుకవలెను.
4) ప్రోగ్రాంలో మాట్లాడే పదాలు స్పష్టంగా వచ్చేంత వరకు **Pratice** చేయాలి.

ఇచ్చట వర్థమాన మరియు ఔత్సాహికులైన మిమిక్రీ కళాకారుల కోసం వెంట్రిలాక్విజం స్క్రిప్టు విపులంగా ఇవ్వడం జరిగింది.

బొమ్మ శ్రీనివాస్

**స్క్రిప్ట్ నెం. 1**

కళాకారుడు : హలో.... హలో.... హలో...

మాట్లాడేబొమ్మ : హలో..

క : హలో (మృదుమధురంగా)

మా : హలో (మృదుమధురంగా)

క : హలో

మా : హలో (కోపంగా)

క : ఈరోజు మనం ఇక్కడ ప్రోగ్రామ్ చేస్తున్నాం కదా!

మా : ఇక్కడెక్కడ?

క : అదే... మనం ఈ ప్రాంతంలో ప్రోగ్రాం చేస్తున్నాం కదా! (ఎక్కడ పోగ్రాం చేస్తే ఆ ప్రాంతం పేరు చెప్పాలి.)

మా : అయితే... ఏంటి

క : అలా అనొద్దు. ఈ ప్రాంతంలో ప్రోగ్రామ్ ఇస్తున్నాం కాబట్టి ఇక్కడికి విచ్చేసిన ప్రముఖులకు, పెద్దలకు పిల్లలకు అందరికి ప్రతి ఒక్కరికి మనం నమస్కారం చెయ్యాలి?

మా : ఎలాగా?

క : ఎలాగంటె? ఇక్కడ సోదరులున్నారు, సోదరీమణులున్నారు.

మా : అవును గురువు గారు

క : కాబట్టి ఇద్దరికి కలిపి నమస్కారం చేద్దాం

మా : ఎలాగయ్యా?

క : సోదరులున్నారు

మా : ఉన్నారు

క : సోదరీమణులున్నారు

మా : ఉన్నారు

క : అందుచేత

మా : ఆ....

క : సోదర, సోదరీమణులారా

మా : నీకు సిగ్గులేదురా

క : చూడూ... నీ సంగతి ఇక్కడ కాదు. ఇంటికి పోయాక

చెబుతా

మా : ఏం చేస్తావ్?

క : ఏం చేస్తానా! నీ డొక్క చింపేస్తా

మా : నేను ఊరుకుంటానా

క : ఊరుకోక ఏం చేస్తావ్

మా : అంటే..... చింపేస్తే ఉరుకుంటానా

క : ఆ.... ఏం చేస్తావ్?

మా : కుట్టుకుంటాను.

క : సరే గాని ఇక్కడ మనకు మిత్రులు చాలా మంది ఉన్నారు.

మా : అయితే

క : మిత్రులందరికి నమస్కారం

మా : శత్రువులందరికి నమస్కారం

క : ఇక్కడ మనకు శత్రువులు ఎవరున్నారు.?

మా : ఉన్నారు

క : ఎవరు?

మా : నిలబడినవారు

క : ఐ మీన్, నిలబడ్డవారంటే ప్రక్కలకు, వెనకకు నిలబడ్డవారు కాదండి. కూర్చున్నవారిలో ఎవరైనా లేస్తారనుకోండి వెనకవారికి కన్పించదు అందుకే మా వాడులా అన్నాడు.

మా : అవునయ్యా

క : సరె! ఇక్కడ చదువుకున్నవారు చాలామంది ఉన్నారు.

మా : అయితే

క : ఇంగ్లీష్‌లో నమస్కారం చేద్దాం.

మా : ఎలాగా

క : నీకు మార్నింగ్ అంటే ఇష్టమా?

మా : లేదు. ఈవ్నింగ్.

క : అయితే ఇలా చెప్పండి.

మా : ఎలా?

క : Good evening Ladies & Gentlemen

మా : Good evening Ladies

క : What about Gentlemen

మా : I am not interested

క : అయితే ఇలా కాదు కాని

మా : మరి ఎలా?

క : ఒక్క ముక్కలో చెప్పేద్దాం!

మా : ఎలాగయ్యా

క : అందరికి నమస్కారం

మా : కొందరికే నమస్కారం

క : కొందరెవరికి?

మా : అమ్మాయిలకి.

**స్కిప్ నెం. 2**

క : నేటి బాలబాలికలే రేపటి భావి భారత పౌరులు

మా : ఎవడన్నాడు?

క : ఎవడన్నాడు కాదు. అలా అనకూడదు. తప్పమ్మ. Give respect and take respect అన్నారు.

మా : ఎవడు

క : చూడు

మా : చూశా

క : ఏం చూశావ్?

మా : ఏం చూడమన్నావ్?

క : నీతో నాకెందుక్కాని... ఒక పని చేయి

మా : ఏంటి!

క : ఒక పదము నేను చెబుతాను. రెండవ పదం నువ్వు చెప్పేసేయ్?

మా : ఎలాగ?

క : నేటి బాలబాలికలే అని నేను చెబుతాను, రేపటి భావి భారత

: పొరులు అని నువ్వు చెప్పేయ్.

మా : సరె

క : ఓ.కే. నా?

మా : ఓ.కే.

క : నేటి బాలబాలికలే.....

మా : రేపటి భార్యాభర్తలు

క : చూడు. ఇది చాలా తప్పమ్మా

మా : నేను చెప్పిందే కరెక్ట్

క : నేను చెప్పినట్లు చెప్పడం లేదు. ఏమండి నేను చెప్పినట్లు చెబుతున్నాడా? (ప్రేక్షకులతో)

ప్రే : చెప్పడం లేదు... చెప్పడం లేదు

క : చూశావా! వాళ్లందరూ కూడా చెబుతున్నారు. కాబట్టి నేను ఎలా చెబితే అలాగ చెప్పాలి.

మా : అలాగే

క : మాట మార్చొద్దు

మా : సరె

క : అ

మా : అ

క : ఆ

మా : ఆ

క : సరె

మా : సరె

క : నేను ఎలా అంటే అలా అంటావేంటి?

మా : నేను ఎలా అంటే అలా అంటావేంటి!?

క : చూడు

మా : చూడు

క : నేను చాలా మంచివాణ్ణి

మా : నేను చాలా మంచివాణ్ణి

క : నేను చాలా గొప్పవాణ్ణి

మా : నేను చాలా గొప్పవాణ్ణి

క ; నేను ఎందుకూ పనికి రాని వెధవను

మా : అందరికి తెలుసు

క : ఇప్పటి వరకునేను చెప్పినట్లు చెప్పావు కదా!

మా : ఆ...

క : మరి చివరి మాట ఎందుకు చెప్పలేదు.

మా : నేను చెవిలో పువ్వు పెట్టుకోలేదయ్యా

క : అంటే నేను పెట్టుకున్నానా!

మా : ఏమో మరి

**స్క్రిప్ట్ నెం. 3**

క : నీ పేరు

మా : నా పేరా?

క : ఆ... నీపేరు

మా : బోషిడికె

క : బోషిడికెనా?

మా : అవునండి. బోషిడికేనండి.

క : అలా కాదు గాని, నీ పేరు, నీ ఇంటి పేరు చెప్పు!

మా : నా పేరు బోస్, ఇంటి పేరు డి.కె.

క : ఇంటిపేరు ముందుండాలి అప్పుడు డి.కె. బోస్ అని ముద్దుగా అంటారు.

మా : లేకుంటే అనరా?

క : బోషిడికె అనే అంటారు. సరె!

మా : హా...

క : మీ ఇల్లెక్కడ?

మా : హైదరాబాద్‌లో

క : హైదరాబాద్‌లో మీ ఇల్లెక్కడ?

మా : చిరంజీవి ఇంటి ముందు

క : మరి... చిరంజీవి గారి ఇల్లెక్కడ?

మా : మా ఇంటి ముందు

క : అలాకాదు.. చిరంజీవి ఇల్లు మీ ఇంటి ముందు. మీ ఇల్లు చిరంజీవి గారి ఇంటి ముందు మీ ఇద్దరి ఇళ్ళు హైదరాబాద్‌లో ఎక్కడ ఉన్నాయి?

మా : ఎదురెదురుగా

క : చూడు. నీతో మాట్లాడాలంటే చాలా కష్టం

మా : అయితే నీ యిష్టం.

**స్క్రిప్ట్ నెం. 4**

క : మీరు ఎంత మంది అన్నదమ్ములు?

మా : పదకొండు

క : అంటే మీ నాన్న గారు ఒక క్రికెట్ టీమ్‌నే తయారు చేశారన్న మాట.

మా : ఇంకో టీమ్ కొరకు ట్రై చేస్తున్నారు.

క : అంటే మీ నాన్న గారికి వేరే పనేంలేదా?

మా : ఇదే పని

క : ఇంతకు పదకొండు మందికి పెళ్లిల్లు అయ్యాయా?

మా : ఒక్కరికే కాలేదు.

క : అంటే నీకు కాలేదా!

మా : అయ్యింది.

క : నీకు పెళ్లయిందా!

మా : అయ్యిందయ్యా

క : మరి మీా ఇంట్లో ఎవరికి పెళ్ళి కాలేదు?

మా : మా నాన్నగారికి

క : ఆ... మీ నాన్న గారికి పెళ్లికాకుండ మీరందరూ ఎలా పుట్టారు.

మా : అడ్వాన్స్‌గా

క : మీ నాన్నగారు ఏం చేస్తుంటారు?

మా : ఇంజనీరు

క : ఇంజనీరా!

మా : అవునయ్యా

క : మా ఫ్రెండ్స్ కాదంటున్నారు. నిజంగా మీ నాన్న గారు ఏం చేస్తారు.?

మా : ఇంజన్‌లో నీళ్లు పోస్తుంటారు.

క : ఇంజన్‌లో నీళ్లు పోస్తే ఇంజనీరా!

మా : అవునయ్యా!

క : మీ నాన్న గారి పేరు?

మా : దొండ కాయ

క : మీ అమ్మగారి పేరు?

మా : బుడంకాయ

క : అందుకే పొట్టిగా ఉన్నావా?

మా : అవునయ్యా

క : మరి నీ కాళ్లు చేతులు పని చేస్తున్నాయా?

మా : చేయడం లేదు

క : ఎందుకు?

మా : నేను... పోలియో చుక్కలు వేయించుకోలేదు.

(ఈ విధంగా పిల్లలకు, గ్రామస్థులకు పోలియో చుక్కలు వేయించు కోకపోతే జరిగే అనర్థాలను బొమ్మ ద్వారా అందరికీ అర్థం అయ్యేలా తెలుపవచ్చు.)

మాట్లాడే బొమ్మ ఒక అమ్మాయితో మాట్లాడే సన్నివేశం చూద్దాం.

**స్క్రిప్‌నెం. 5**

('బొమ్మ' ఒక అమ్మాయితో మాట్లాడే సన్నివేశం)

క : అమ్మాయి వచ్చేసింది. ఇటు కాదు అటు చూడు.

మా : సిగ్గేస్తోంది.

క : అమ్మాయి సిగ్గుపడాలి గాని నీ కేంటి? నేను పక్కనే ఉన్నాగా మాట్లాడు

మా : సిగ్గేస్తోంది గురువు గారు

క : పరవాలేదు... మాట్లాడు

మా : నీ పేరు?

క : నీ పేరు (వెంటనే అనాలి)

మా : నీ కెందుకుగురువు గారు?

క : అంటే మధ్యలో నేను రాకూడదా?

మా : అవునయ్యా

క : అంటే మీరిద్దరే మాట్లాడుకుంటారా?

మా : పర్సనల్‌గా

క : సరే! మాట్లాడుకోండి

మా : నీ పేరు!

క : నీ పేరు (వెంటనే అనాలి)

మా : నీ కెందుకు?

క : సరె! నేను అసలే అడుగను. మాట్లాడుకోండి.

మా : నీ పేరు?

అమ్మాయి : భవానీ

మా : బాగుంది

క : పేరు బాగుందా!

మా : అమ్మాయి కూడా బాగుంది

క : సరె! ఇంకా ఏమైనా అడుగు

మా : ఎన్నో తరగతి చదువుచున్నావు?

అమ్మాయి : ఆరు

మా : నేను ఏడు

క : ఏమిటి! ఆ అమ్మాయి 6 అయితే నువ్వు 7వ తరగతా?

మా : అవునయ్యా

క : నువ్వు కూడా 6వ తరగతే కదా! ఒక్క తరగతి ఎందుకు ఎక్కువ చేసి చెప్పావు?

మా : లైన్ కలుపుకుందామనీ...

క : ఇంకా అడుగు

మా : మీ డాడి పేరు?

అమ్మాయి : బాబూరావు

మా : నాకు తెలుసు

క : వీళ్ల డాడి నీకెలా తెలుసు?

మా : నా క్లాస్‌మేట్

క : ఇంకా ఏమైనా అడుగు

మా : నీకు లెక్కలు వచ్చా?

క : వచ్చు

మా : రెండు, రెండు ఎంత?

క : నాలుగు

మా : లేదు

క : రెండు రెండు నాలుగు. ఆ అమ్మాయి చాలా కరెక్ట్‌గా చెప్పింది

మా : లేదయ్యా

క : మరి ఎంతో నువ్వు చెప్ప

మా : రెండు, రెండు

క : ఆ... రెండు రెండు

మా : ఇరవై రెండు

క : చాలా బాగుంది

మా : ఎవడన్నాడు?

క : ఇంకా నూట్లాడు

మా : ఏ స్కూల్?

క : సరస్వతి శిశు మందిర్

మా : నేను ఆ స్కూల్‌లో చేరతా!

క : ఎందుకు?

మా : అమ్మాయి కోసం

**స్క్రిప్ట్ నెం. 6**

**(అబ్బాయితో బొమ్మ మాట్లాడటం)**

మా : నీ పేరు

అబ్బాయి: మణిదీప్

మా : నాకు తెలుసు

క : ఈ అబ్బాయి ఇప్పుడే కదా వచ్చింది నీకెలా తెలుసు!

మా : మా ఇంటి ప్రక్క అమ్మాయిని లవ్ చేస్తున్నాడు.

క : ఏమయ్యా బాబు, వీళ్ల ఇంటి పక్క అమ్మాయిని లవ్ చేస్తున్నావా!

అబ్బాయి : చేయడం లేదు

క : ఏం చేయడం లేదు

అబ్బాయి : లవ్

క : అ అబ్బాయి లవ్ చేయడం లేదట. ఒకవేళ లవ్ చేశాడే అనుకుందాం. నీ కెందుకు?

మా : నేను కూడ

క : ఆ.. నువ్వు కూడ

మా : ఆ అమ్మాయినే....

క : ఆ అమ్మాయినే....

మా : లవ్ చేస్తున్నా!

క : ఈ అబ్బాయికి జాతకం చూస్తావా?

మా : ఏది... చేయి చూపించు

క : బాబు చేయి చూపించు

(చూపించగానే)

క : ఇతనికి పెళ్ళవుతుందా?

మా : ఇద్దరు పెళ్ళాలు.

క : మరి ఇతనికి పిల్లలవుతారా?

మా : ఇతనికి లేరు, కాని ఇతని భార్యలకున్నారు.

**స్క్రిప్ట్ నెంబర్ 7**

క : బోస్

మా : ఏంటి

క : ఈ ప్రోగ్రామ్ చూడటానికి

మా : ఆ...

క : ముఖ్యంగా నిన్ను చూడటానికి

మా : అవునా!

క : ఇంత మంది ప్రేక్షక మహానుభావులు వచ్చారు కదా

మా : అయితే

క : వారందరికి ఒక మంచి సందేశం ఉన్న చక్కటి పాట వినిపించు

మా : నేను పాడనయ్యా

క : మరేం చేస్తావు

మా : కథ చెబుతాను

క : మా వాడు మంచి కథ చెబుతాడు. మీరందరు జాగ్రత్తగా వినండి.

మా : ఒక ఉళ్లో రెండు ఫ్యామిలీలు ఉన్నాయి.

క : అదేంటి ఉళ్లో చాలా ఫ్యామిలీలు ఉంటాయి కదా.

మా : నా కథలో గురువు గారు

క : సరే... కథ చెప్పు

మా : అందులో ఒక ఫ్యామిలీకి పిల్లలు లేరు

క : అంటే రెండో ఫ్యామిలీకి పిల్లలు ఉన్నారన్నమాట

మా : అవునయ్యా

క : అయితే. ఏమయ్యింది.

మా : ఒకరోజు పిల్లలు లేనివారికి యాక్సిడెంట్ అయ్యింది.

క : అయితే

మా : ఇంటి పక్క వాడు ఇద్దరికి రక్తం ఇచ్చాడు

క : చాలా మంచి పని చేశాడు. రక్తదానం ప్రాణదానంతో సమానం

మా : ఒక రోజు పిల్లలు లేనివారికి ఒక కొడుకు పుట్టాడు

క : చాలా సంతోషం అసలే పిల్లలు లేక బాధపడుతుంటే తరువాత సంతానం కలగడం సంతోషం అది అబ్బాయి కావడం మరి సంతోషం కదా!

మా : ఆ అబ్బాయి 6 నెలలకు 'తాతా' అన్నాడు

క : కామన్‌గా తాతా, మామా అంటుంటారు పిల్లలు. ఇంతకు తాతా అంటే ఏమయ్యింది.

మా : ఖతమ్

క : ఏంటిది

మా : తాతా చచ్చిపోయాడు

క : పాపం

మా : ఒక రోజు రాత్రి

క : ఆ.. రాత్రి

మా : 'అమ్మమ్మ' అన్నాడు

క : అంటే

మా : ఖతమ్

క : అమ్మమ్మ కూడా

మా : చచ్చిపోయింది

క : అరె! చాలా గమ్మత్తుగా ఉంది. వీడు పిలిచిన వాడళ్లా చచ్చిపోతుండు.

మా : అవునయ్యా

క : ఇంతకు ఏమయ్యింది

మా : ఒక రోజు రాత్రి 12 గంటలకు

క : 12 గంటలకు

మా : 'అమ్మా' అన్నాడయ్యా

క : అమ్మ కూడా...!

మా : ఖతమ్

క : అరె! వీడు ఏ ఘడియలో పుట్టిండో, పిలిచినోడల్లా చస్తుండు

మా : వాళ్ల నాన్నకే దిగులు పట్టుకుంది

క : కాదా మరి! పిలిచిన వాడల్ల చచ్చిపోతుంటే! ఎక్కడ 'నాన్నా' అంటే చచ్చిపోతానా అని దిగులు పట్టదా! ఇంతకు నాన్నా అని పిలిచాడా?

మా : ఒక రోజు

క : ఒక రోజు

మా : రాత్రి 2 గంటలకు

క : ఆ... నాన్నా అన్నాడా!

మా : అన్నాడయ్యా

క : ఇంకేముంది. వాళ్ల నాన్న కూడా చచ్చిపోయి ఉంటాడు.

మా : లేదయ్యా

క : చచ్చిపోలేదా! చాలా ఆశ్చర్యంగా ఉందే...!

మా : తెల్లారే సరికి

క : ఆ... ఏమైంది

మా : ఇంటి పక్కవాడు

క : ఆ.... ఇంటి పక్కవాడు

మా : ఖతమ్

క : నాకు ఈ కథ అసలే అర్థం కాలే

మా : ఇదంతా ఎయిడ్స్ గురువు గారు

క : ఎలాగా?

మా : ఎలాగంటే కలుషితమైన రక్తం ఇద్దరికి ఇవ్వడం వలన ఇలా ఎయిడ్స్ అందరికి వచ్చింది.

క : ఇలా మావాడు ఒక చిన్నకథ ద్వారా "ఎయిడ్స్" గురించి చాలా చక్కగా చెప్పాడు. ఎయిడ్స్‌కు మందులేదు నివారణ ఒక్కటే మార్గం. మీరందరు సహృదయంతో ఆదరిస్తారని ఆశిస్తూ....

క : సరే! ఇప్పటికి చాలా టైమ్ అయ్యింది చివరిగా నేను ఒక పాట పాడతాను.

మా : నేను కూడా

క : నువ్వు కూడ పాడతావా! అయితే నువ్వు వెనకమాల పాడు

మా : సరెనండి

క : కుడికన్ను కొట్టగానె

మా : కుర్రోణ్ణి

క : ఎడం కన్నుకొట్టగానె

మా : ఎర్రోణ్ణి

క : మరి.... రెండు కళ్ళు కొట్టగానే...

మా : గుడ్డోణ్ణి

ఈ విధంగా హాస్యాన్ని పండించడమే కాకుంకా వెంట్రిలాక్విజం (మాట్లాడే బొమ్మ) ఆధారంగా సరదగా అమ్మాయి, అబ్బాయితో మాట్లాడటమే కాక, పోలియో చుక్కలు వేయించుకొనకపోతే కలిగే అనర్థాలు, పాన్, గుట్కాలు, ధూమపానం, మద్యపానం సేవించడం వలన కలిగే అనర్థాలకు, ఎయిడ్స్, కుటుంబ నియంత్రణ, మెదడు వాపు వ్యాధి గురించి వివరంగా గ్రామ ప్రజలకు, పిల్లలకు అందరికి అర్థం అయ్యేలా చిన్నచిన్న కథల ఆధారంగా బొమ్మతో సందేశాత్మకంగా చెప్పించవచ్చును.

మీ మీ ఆలోచనలనుబట్టి మరిన్ని స్కిట్స్‌లను తయారుచేసుకోగలరు.



# సినిమా నటుల డైలాగ్స్

# Dialogues of Cine Actors

సినీనటులను అనుకరించడం మిమిక్రీ కళలో అత్యంత ప్రధాన ఘట్టం. ముందు ఏ సినీ నటుడ్ని అనుకరించదల్చుకున్నారో అతని డైలాగు సేకరించి అవపోసన (బట్టీ) పట్టాలి. ఆ డైలాగును అనేక మార్లు జాగ్రత్తగా వినాలి. ఆ తరువాత ఉచ్చారణను పసిగట్టి, సాధన చేయడం ద్వారా ఆయా సినీనటుల గొంతులను అనుకరించవచ్చును. ఎందుకంటే మిమిక్రీ కళాకారుని గొంతుకు దగ్గరగా ఉన్న సినీనటుల గొంతులను అనుకరించాల్సినపుడు తక్కువ సార్లు, మిమిక్రీ కళాకారుని గొంతుకి దూరంగా ఉన్న సినీనటుల గొంతులను అనుకరించాల్సినపుడు ఎక్కువ సార్లు సాధన చేయాల్సి వుంటుంది.

సినీమా నటుల డైలాగ్స్‌ను సంభాషణలను తీసుకొని వారి యొక్క హావభావాలతో వారి గొంతును వారి బాణీలోనే అనుకరించి చూపించినపుడు కడుపుబ్బా నవ్వుకొని మానసికోల్లాసాన్ని పొంది ఆరోగ్యవంతులవుతారు.

**గమనిక : డైలాగ్‌ను ఎక్కడెక్కడ బ్రేక్ చేయాలో ఆబ్లిక్ (/) గుర్తు ద్వారా సూచించడం జరిగినది.**

**1. రజనీకాంత్** 'బాషా' చిత్రం నుండి :

హ...హ... /ఈ బాషా దగ్గర/ ఆంటోని.../ ఆంటోని గురించి చెప్పొద్దు /నీ దగ్గర నుండి నిజం ఎలా రాబట్టాలో ఈ బాషాకి తెలుసు/ తెల్సుగా/ ఈ బాషా/ ఒక్కసారి చెబితే/ 100 సార్లు చెప్పినట్టే/ చెప్పు/ నువ్వాడి దగ్గరికి ఎందుకొచ్చావు/ బ్యాగులో ఏం ఉంది.../ హ...

**2. వెంకటేశ్** 'గణేశ్' చిత్రం నుండి :

మీ దృష్టిలో, మీ 'లా' దృష్టిలో ఈ ప్రపంచం దృష్టిలో నేను ఆత్మహత్య చేసుకోబోయాను./ కానీ/ ఎవరికి తెలియకుండ నా అంతరాత్మకు తెలిసి నేను ఇద్దర్ని హత్య చేశాను/ ఒకరు రాంచంద్రయ్య/ రెండు గంగ/ రాంచంద్రయ్య నా తండ్రి/ గంగ నా చెల్లెలు.

**3. కోటశ్రీనివాసరావు** 'గణేశ్' చిత్రం నుండి :

తమ్మి.... / కాళ్ళు మొక్కిన గాని కాదన్నావులే/ హు.../ నువ్వు నా లెక్క మొండోనివే/ గదే నాకు నచ్చింది/ కాని. మారాలి తమ్మి/ మారి తీరతావ్.

**4. కమల్‌హాసన్** 'భారతీయుడు' చిత్రం నుండి :

ఏనాడు పచ్చని స్వతంత్ర భారతికి లంచాల చిచ్చుపెట్టే స్వార్థపు నిరుద్యోగులు కలుపు మొక్కలుగా తయారయ్యారో/ ఆ చిచ్చు చల్లారాలంటే కలుపు మొక్కల్ని ఏరి పారెయ్యాలి/ పుట్టిన నుండి చచ్చే వరకు, ప్రసూతి నుండి స్మశానం వరకు లంచం.. లంచం.. లంచం... లంచం.../ జాతీయ సమైక్యతా భావం ఈ దేశంలో లంచంలో మాత్రమేరా ఉంది.

**5. నూతన్‌ప్రసాద్** 'ఆజాద్' చిత్రం నుండి :

చూడండి పిల్లలు/ గాంధి గారి గురువు గోఖులే/ ఆజాద్ కాదు/ ఆజాద్ అంటే... స్వాతంత్ర్యం అని అర్థం/ బ్రిటీష్ వారికి దొరికి పోయినపుడు/ నీ పేరేంటని అడిగితే?/ ఆజాద్ అన్నాడు/ ఏమన్నాడు?. యావ్...

బొమ్మ శ్రీనివాస్

**6. నాగార్జున** 'ఆజాద్' చిత్రం నుండి :

కార్గిల్‌లో ఒక రాయిని కూడా కదపలేక పోయారు / కాశ్మీర్ యాపిల్ కావల్సొచ్చిందిరా మీకు/ కాశ్మీరే కాదు/ భారతదేశంలో ఒక గడ్డిపోచ కూడా పీకలేరు/ ఆంధ్రుడు.../ భారతీయుడు.../ అతి సామాన్యుడు/ ఆ..జా..ద్...

**7. రఘువరన్** 'ఆజాద్' చిత్రం నుండి

ఖురాన్ చదివిన ఈ నోటితోనే/ గీత చదివాను. నేను పైకి వేసుకున్నది కాషాయమైనా/ లోపలున్నదంతా ఆకుపచ్చేరా./ నేను పాకిస్తాన్‌లో పుట్టి, అమ్మ ఒడిలో పడకముందే/ ఆ...ఖుదా/ నన్ను ఇండియాలో పడేశాడురా/ నేను మనిషిని కాదురా!/ మిస్సైల్/ నన్ను ఒక్కడు చీల్చి చూశాడురా/ ఆ...జా...ద్.../ వాడు చావాలి/ వాడి చావు ఎంత భయకరంగా ఉండాలంటే/ ఈ దేశంలో/ 'జీహాద్'కి ఎదురుగా ఎప్పుడూ ఎవరూ ఉండకూడదు.

**8. ప్రకాశ్‌రాజ్** 'ఆజాద్' చిత్రం నుండి :

ఒక్కడు/ ఒకేఒక్కడు 20 మంది పోలీసోళ్లని చంపి నలుగుర్ని పెళ్లికొడుకుల్లా తీస్కెళ్ళాడంటే/ వాడు మనం అనుకున్నట్లు ఆర్డినరి గూండానో, రౌడీనో, ఫ్యాక్షనిస్టో కాదు/ He is power full/ He is intelligent/ Who is this స్మగ్లర్/ వాడెవడు? / వాడెవడు?

**9. మోహన్‌బాబు** 'రాయలసీమ రామన్న చౌదరి' చిత్రం నుండి :

నీకు చేతులున్నది మాకు దండం పెట్టడానికే కాదురా/ దస్తావేజుల మీద సంతకం పెట్టడానిక్కూడా/ ఏయ్.../ బలవంతుడు ఎదురు వచ్చినపుడు తలవంచినవాడు బాగుపడతాడు/ ఎదురించినవాడు బావిలో పడతాడు.

**10. బాలకృష్ణ** 'నరసింహానాయుడు' చిత్రం నుండి :

పోనీ.../ నీ ఊరు నడిబొడ్డులో చూస్కొందామా!/ ప్లేస్ నువ్వు చెప్పినా సరే, నన్ను చెప్పమన్నా సరే/ టైం నువ్వు చెప్పినా సరే నన్ను చెప్పమన్నా సరే/ ఎప్పుడైనా సరే ఎక్కడైనా సరే/ కత్తులతో కాదురా కంటి చూపుతో సంపెత్తా.

**11. అక్కినేని నాగేశ్వరరావు** 'ప్రేమాభిషేకం' చిత్రం నుండి :

వంద అబద్ధాలాడయినా ఒకపెళ్లి చేయమన్నారు/ వెయ్యి అబద్ధాలాడయినా ఒక కాపురం నిలబెట్టమన్నారు/ ఈ ఒక్క అబద్ధం ఆడితే చాలు/ ఒక్క అమ్మాయి జీవితమే నిలబడుతుంది/ ఒరేయ్ ఇంతకంటే వివరాలు నన్ను ఏమి అడుగొద్దురా!/ స్నేహితుడిగా నేను మీ మధ్య సంతోషంగా ఉండాలంటే/ ఒక ఆడపిల్ల పసుపు, కుంకుమలు కాపాడాలన్నా/ మీరీ సాయం చేయాలి... తప్పదు.

**12. 'కళ్ళు' చిదంబరం**

ఆరులో నుండి మూడెంటె/ మూడులో కెళ్లి ఆరు తియ్యా కూడదేంటి?/ ఆరులో నుండి మూడుపోతే మూడు/ ఇది కూడ తెలియదేంటి/ అదేం విచిత్రమేంటి.

**13. ముక్కామల** 'మాయాబజార్' చిత్రం నుండి :

జూదంలో జయాపజయాలు దైవాధీనాలు మామా/ ఒకవేళ మనమే ఓడితే....

**14. ఎన్.టి. రామారావు** 'బొబ్బిలిపులి' చిత్రం నుండి

ఎన్.టి.రామారావు : పై కోర్టు కెళితే శిక్ష తగ్గుతుందా యువరానర్

జడ్జి : శిక్ష తగ్గించవచ్చు. లేదా అదే శిక్ష ఖాయం చేయవచ్చు

ఎన్.టి.రామారావు : అంటే.../ ఈ కోర్టులో వేసిన శిక్ష పైకోర్టులో పోవచ్చు/ ఆకోర్టులో వేసిన శిక్ష ఆ పై కోర్టులో పోవచ్చు/ లేదా/ క్రింది కోర్టువారు వేసిన శిక్షనే పై కోర్టువారు ఖాయం చేయవచ్చు../ అంటే/ ఒక కోర్టుకి ఇంకో కోర్టుకి సంబంధం ఉండవచ్చు...ఉండకపోవచ్చు.../ కోర్టు కోర్టుకీ, తీర్పు తీర్పుకి ఇంత మార్పుంటే/ మీ న్యాయస్థానంలో న్యాయం ఉన్నట్టా

యువరానర్....

**చిరంజీవి** 'మాస్టర్' చిత్రం నుండి:

దేవరాజ్ / స్టూడెంట్స్ తలచుకుంటే రాజ్యాలే కూలిపోతాయి./ **Aftral** నువ్వెంత / నా వెనకున్న జనం డబ్బుతో రాలేదు. / ప్రేమతో వచ్చారు. అభిమానంతో వచ్చారు. / ఒకప్పుడు నేను మామూలు వ్యక్తిని. కాని ఈరోజు / మహాశక్తిని.

**కృష్ణ** 'అగ్నిపర్వతం' చిత్రం నుండి:

అగ్ని / జమదగ్ని / ఎవరిక్కడ ఈ సమావేశం ఏర్పాటు చేసింది/ ఎవరిక్కడ వేలం పాట మొదలెట్టింది / ఎవరిక్కడ నా తలకొట్టి తెస్తానని ప్రతిజ్ఞ చేసింది. / మాట్లాడరే / పిరికితనమా / నోరు పెగలడం లేదా! గుండె చాలటం లేదా?

**యల్.బి. శ్రీరాం** 'చాలా బాగుంది' చిత్రం నుండి:

ఏం చెత్తాడంటే...../ పొద్దుటే టిఫిన్ చేస్తాడు. / మధ్యాహ్నం భోం చేత్తాడు. / సాయంత్రం మళ్ళీ భోం చేత్తాడు. / రాత్రికి మా అమ్మాయితో ఏం చేస్తాడో మరి.......?

**జయప్రకాష్** 'నరసింహనాయుడు' చిత్రం నుండి:

ఏంటిరా / ఏదో దయ్యాన్ని చూసినట్లు పారిపోతున్నారో / ఏమయ్యింది.

**జూ॥ యన్.టి.ఆర్.** 'ఆది' చిత్రం నుండి:

ఒరేయ్.....రేయ్....రేయ్ / ఈ సీమలో మొట్టమొదట కత్తిపట్టింది మా తాత, బాంబు చుట్టింది మా తాత / వాటితో నువ్వేంటిరా నన్ను పీకేది, ఆ..... / ఏ.... మా దగ్గర లేవా కత్తులు, బాంబులు / ఇదిగో చూడు/ మీ దగ్గరున్న ఆయుధాలకంటే / నా ఆశయం బలమైనది / చావుకు నేను ఎప్పుడు భయపడనురా / ఆ చావే నన్ను చూసి భయపడాలిరా/



కత్తులట, కత్తులు...



# శబ్దాల ఆధారంగా సన్నివేశాలు

# SOUNDS

శబ్దాలు శబ్ద విజ్ఞానం కూడా మిమిక్రీ ప్రదర్శనలో అత్యంత కీలక పాత్ర వహిస్తాయి. లేనిది ఉన్నట్లుగా, ఉన్నది లేనట్లుగా శబ్దాల సహాయంతో ప్రేక్షకులను భ్రమింపజేయవచ్చును. వివిధ రకాల శబ్దాలను సృష్టించి ప్రేక్షకులకు విన్పించడం ద్వారా వారిలో మానసిక ఉల్లాసంతో పాటు ఆసక్తిని కల్గించవచ్చు.

కొన్ని రకాల సన్నివేశాలను తీస్కొని రాబోయే ఇంగ్లీష్ సినిమా ట్రయల్ రీల్ కానివ్వండి, ప్రధాని సభకు వస్తుంటే హెలికాప్టర్ ల్యాండింగ్ అవటం కానివ్వండి, ఇంగ్లీష్ సినిమా సన్నివేశం కానివ్వండి, ఇండియన్ న్యూస్ రివ్యూ లాంటి అనేకమైన సన్నివేశాలను చెప్పాల్సి వచ్చినపుడు శబ్దాలను ఉపయోగించి చెప్పినపుడు ప్రేక్షకులు రసానుభూతిని పొంది చప్పట్లతో మిమిక్రీ కళాకారుని అభినందిస్తారు. సౌండ్స్‌ని ఉపయోగించి ప్రదర్శించడం ద్వారా ప్రేక్షకులకు అదొక అద్భుతమైన అనుభూతిగా మిగిలిపోతుంది. ధ్వనుల అనుకరణలో ఏ మాత్రం నాణ్యత లోపించినా ఆ సన్నివేశం ఉప్పలేని కూరలాగా తయారవుతుంది.

'ధ్వనుల' సహాయంతో ప్రదర్శించే సన్నివేశాలను క్రింద పేర్కొనడం జరిగింది అవి 1. బ్యాంక్ దోపిడి, 2. మెకానస్ గోల్డ్, 3. సీక్రెట్.

## 1. బ్యాంకు దోపిడి

మనం గత 30 సంవత్సరాల నుండి వస్తున్న తెలుగు సినిమాలను చూస్తున్నాం. అప్పటి నుండి ఇప్పటి వరకు ఎన్నో రకాల సినిమాలు వచ్చాయి. సినిమాలలో కొన్ని రకాలైన సంఘటనలు ఎదురవుతుంటాయి. ఈ సంఘటనలు చాలా గమ్మత్తుగా ఉంటాయి. అలాంటిదే ఒక సీన్ . "బ్యాంక్ దోపిడి".

ఇక తెలుగు సినీమాలలో బ్యాంక్ దోపిడి సన్నివేశాలు-న్నాయనుకోండి. ఆ బ్యాంక్ దోపిడి సన్నివేశాన్ని మన డైరెక్టర్స్ ఎంత బాగా తీయాలనుకున్నా అవి ఒక్కొక్కసారి నవ్వుల పాలవుతుంటాయి.

ఆ బ్యాంక్ దోపిడి సన్నివేశంలో సౌండ్స్ అన్నీ ఏ విధంగా ఉంటాయో వివరిస్తాను.

బ్యాంక్ దోపిడి సాధారణంగా అర్థరాత్రి జరుగుతుంది. అర్థరాత్రి 12 గంటలకు గడియారం ఇలా గంటలు కొడుతుంది.

డింగ్... డింగ్... డింగ్... డింగ్...

దొంగలు నడిచి వస్తుంటారు. వాళ్ళు నడుస్తున్నప్పుడు బూట్ల శబ్దం వస్తుంటుంది. ఒక్కొక్కరు నెమ్మదిగా వెళ్తున్నారు.

టక్... టక్... టక్... టక్... టక్... టక్... టక్... టక్...

వీళ్ళు నడుస్తుంటే... అర్థరాత్రి సమయం కదా! అప్పుడు కుక్కలు అరుస్తున్నాయి. కుక్కల అరుపులు దూరం ఇలా నుండి విన్పిస్తున్నాయి.

వవ్... వవ్... వవ్‌వవ్... వవ్వ్వ్...

దొంగలు బ్యాంకు వద్దకు వచ్చారు. ఆ బ్యాంకు లోపలికి ఎలా వెళ్లాలని చూస్తున్నారు. (అప్పుడు మ్యూజిక్)

టుర్ర్ర్ర్... వుయ్ వుయ్ వుయ్ వుయ్...

అక్కడ గూర్ఖా ఉంటాడు. వాడిని ఒక్క దెబ్బ కొట్టారు.

డిష్... హ...

దొంగలు బ్యాంక్ లోపలికి వెళ్ళేటప్పుడు మ్యూజిక్...

టక్... టక్... టక్... టకుటకుటకు... టక్... టక్... టక్..

లోపలికి వెళ్ళారు. అక్కడ అలారం ఇచ్చే బెల్ కనెక్షన్‌ని కటింగ్ ప్లేయర్‌తో ఒకడు కట్ చేశాడు.

క్లచ్...

అక్కడ ఒక బీరువా ఉంది. ఆ బీరువాను మారుతాళంతో తీస్తున్నారు. అప్పుడు మ్యూజిక్.

కుయ్‌య్...కుయ్‌య్...కుయ్‌య్‌య్‌య్‌య్

దానికి పిడిలాంటిది ఒక నెంబర్స్ తిప్పే తాళం ఉంది దానిని త్రిప్పుచున్నారు.

చుక్.....చుక్.....చుక్.....చుక్.....చుక్‌చుక్‌చుక్...గుర్రుర్రు

తలుపు తీశారు. ఆ డబ్బంతా పెట్టెలో వేసుకునే సరికి బయట ఎవరో దొంగతనం జరుగుతుందని పోలీసులకు ఫోన్ చేశారు.

ట్రింగ్...ట్రింగ్... ట్రింగ్...

హలో...పోలీస్ స్టేషనేనా? ఇక్కడ బంజారాహిల్స్‌లో బ్యాంక్ దోపిడి జరుగుతోంది సార్ మీరు వెంటనే రావాలి.

పోలీసు జీపు వస్తున్న శబ్దం.

కుయ్‌య్‌య్... కుయ్‌య్‌య్...

ఈ పోలీస్ వ్యాన్ సౌండ్ వినబడే సమయానికి దొంగలు హడావిడిగా బయటకు వస్తారు. అప్పుడు బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ ఇలా వస్తుంది.

డింగ్ డింగ్ డింగ్...డింగ్ డింగ్ డింగ్...

వాళ్ళ కోసం ఓ కారు సిద్ధంగా ఉంటుంది ఆ కారెక్కి స్టార్ట్ చేస్తున్నారు. కాని అది స్టార్టవడం లేదు. 'కీ' పెట్టి తిప్పుచున్నాడు.

చు...చుక్ చుక్...చు...చుక్ చుక్...కుర్రుర్రు...కుర్రుర్రు...

సరె! అది ఎట్లాగు స్టార్ట్ అయ్యింది వెళ్తున్నారు.

తురురురురు...తురురురురు...

అంతలోనే మన హీరో గారు వస్తారు. అక్కడ మన తెలుగు సినిమా డైరెక్టర్ గారు హీరో గారికి ఒక మోటార్ సైకిల్ ముందే అక్కడ అరేంజ్ చేస్తారు. కాని అది కూడా స్టార్టింగ్ ట్రబుల్ ఇస్తుంటుంది. ఆ క్లచ్ తొక్కుతున్నాడు. (క్లచ్ సౌండు)

**తుక్...తుక్...తుక్...తుక్ తుక్‌తుక్**

సరె ఎలాగు 'కీ' లేకున్నా స్టార్టయింది కారు. వెనకాలె వెళుచున్నాడు.

**తుక్ తుక్ తుక్ తుక్ తుక్**

ముందు కారు, వెనకాల సైకిల్ మోటారు వెళ్తున్నాయి. ఆ వెనకాలె పోలీసులు వచ్చి పిస్తోలుతో కారును కాలుస్తారు.

**టిష్.... టిష్... టిష్...**

అప్పుడు దొంగల జీపు ఒక లోయలో పడిపోతుంది. దొంగలంతా తప్పించుకొని పోతారు. కాని పోలీసులు, దొంగలు చచ్చారనుకొని వెళ్లిపోతారు.

## 2. సీక్రేట్

1. పవన కళ్యాణ్ దొంగ చూపులు చూస్తూ నడుస్తున్నాడు. అతని కాళ్లకు ఉన్న బూట్ల శబ్దం

   **టక్... టక్... టక్... టక్... టక్...**

2. ఒక రూం దగ్గరికి వెళ్లాడు మెల్లిగా డోర్ తీసుకొని లోనికి వెళ్ళాడు. డోర్ తీస్తున్న శబ్దం.

   **కుర్‌ర్‌ర్... డిమ్**

   (అంటు డోర్ బిగుసుక పాయింది)

3. 'ఖుషి' చిత్ర హీరోయిన్ 'భూమిక' వెనకాలె నడుచుకుంటూ అదే దారిలో వస్తుంది. ఆమె కాళ్లకు ఉన్న పట్టీల శబ్దం ఇలా వినిపిస్తుంది.

   ఘల్లు... ఘల్లు... ఘల్లు... ఘల్లు... ఘల్లు... (గజ్జెల శబ్దం)

4. భూమిక అదే డోర్ దగ్గరికి వెళ్లింది (డోర్ తీస్తున్న శబ్దం)

   కర్‌ర్‌ర్‌ర్...

5. ఇద్దరు వరండా నుండి బెడ్ రూం లోనికి వెళ్ళారు.

**"ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలియదు".**

# 3. మేకానస్‌గోల్డ్

1. అదొక ఎడారి ప్రాంతం. ఇసుక తుఫాన్ శబ్దం వినిపిస్తుంటుంది.

   హుశ్.... శ్‌శ్..... ష ష ష ........హ.......హ

2. ఒక మైల్ దూరం నుండి గుఱ్ఱం ఇసుకలో పరుగెడుతూ వస్తుంటుంది.

   చుచుచు... చుచుచు...చుచుచు...చుచుచు...చుచుచు...

   (ఇసుకలో కాబట్టి ఇలాగే శబ్దం వస్తుంది.)

3. ఇక్కడ గ్రిగరిప్ మరియు ఓల్డ్‌మేన్ ఇద్దరు పరస్పరం షూట్ చేస్కొంటారు. ముందు ఓల్డ్‌మేన్, గ్రిగరిప్ ను చూసి షూట్ చేస్తాడు.

   డుష్... ష్... (పిస్టల్ సౌండ్)

   కుయ్... య్‌య్ (గుఱ్ఱపు సకిలిపు)

   (పిస్టల్ సౌండ్‌కి గుఱ్ఱం ఎగిసి పడుతుంది.)

4. గ్రిగరిప్ కింద పడతాడు. గ్రిగరిప్ ప్రక్కకు వెళ్ళి మెల్లిగా ఒక బండ చాటు నుండి ఓల్డ్‌మేన్‌ని షూట్ చేస్తాడు.

   డుష్... ష్ (పిస్టల్ సౌండ్)

   కుయ్... య్‌య్ (గుఱ్ఱపు సకిలింపు)

   (ఇక్కడ కూడా గుఱ్ఱం ఎగిసి పడుతుంది.)

5. బుల్లెట్ తాకి ఓల్డ్‌మేన్ కింద పడతాడు. అతని దగ్గరికి గుఱ్ఱం పై వెళతాడు గ్రిగరిప్.

   చుచుచు...చుచుచు...చుచుచు...చుచుచు... (గుఱ్ఱపు డెక్కల సౌండ్)

6. ఇద్దరి మధ్యన సంభాషణ...

| | | |
|---|---|---|
| గ్రిగరిప్ | : | **I am Mecan** |
| ఓల్డ్‌మేన్ | : | **I Know** |
| గ్రిగరిప్ | : | **Where is the Map** |
| ఓల్డ్‌మేన్ | : | **I have** |
| గ్రిగరిప్ | : | **I want Mecanous Gold Map** |
| ఓల్డ్‌మేన్ | : | **Just wait** |
| గ్రిగరిప్ | : | **Please Hurry up** |
| ఓల్డ్‌మేన్ | : | **Take it** |

7. అంటు ఓల్డ్‌మేన్ చనిపోతాడు. అక్కడ నుండి ఒమన్ షరీఫ్ విలన్ బృందం తన అనుచరులతో గుర్రాలపై వస్తుంటారు.

చుచుచు... చుచుచు...చుచుచు... (గుర్రాలు వస్తున్న శబ్దం)

8. చనిపోయిన ఓల్డ్‌మేన్ కోసం ఇసుకలో గొయ్యి తవ్వుతూ ఉంటాడు గ్రిగరిప్.

శుక్... శుక్... శుక్... శుక్... శుక్... శుక్...

> ప్రోగ్రామ్‌లో తృప్తి అనేది "కాంక్షస్థాయి"పై ఆధారపడి ఉంటుంది.
>
> -బొమ్మ శ్రీనివాస్



# స్టేజీ జోక్స్

# STAGE JOKES

కొందరు ప్రముఖ వ్యక్తులు సభలు, సమావేశాల్లో ప్రసంగించవలసి వచ్చినపుడు తడబడుతూ మాట్లాడటం, చాలా టెన్షన్‌గా ఫీలవటం చూస్తూ వుంటాం.

కొందరైతే చెప్పిన విషయాన్నే పదేపదే చెప్పటం, మాట్లాడాలి కాబట్టి మాట్లాడటం, విషయాన్ని పక్క దారి పట్టించటంలాంటి తమ వ్యక్తిగత బలహీనతల్ని తామే బహిర్గతం చేస్కొని నవ్వుల పాలు కావటం మనం గమనిస్తుంటాం.

మరికొందరు తమ వాక్చాతుర్యం, అభినయం, సమయ స్ఫూర్తి, చమత్కార సందర్భోచిత వ్యాఖ్యానాలతో సభికుల్ని మంత్ర ముగ్ధుల్ని చేస్తారు.

ఇక్కడ స్టేజి జోక్స్ పేరిట కొత్త అంశం చేర్చటంలో ముఖ్య ఉద్దేశ్యమేమంటే కళాకారుడు ఎన్నో జోక్స్‌ను సృష్టిస్తూ వుంటాడు. అలా సృష్టించిన జోక్స్ ఎంత బాగా వున్నా దాన్ని సందర్భానుసారం ఉపయోగించకపోతే దాని వల్ల ప్రయోజనం వుండక పోగా ప్రతికూల పరిస్థితిని ఎదుర్కొనవచ్చు.

కొందరి ప్రముఖుల ఉపన్యాసాలను వారి మ్యానరిజమ్స్‌ను ఆసరగా తీసుకొని సృష్టించిన సన్నివేశాల సముహమే ఈ 'స్టేజి జోక్స్' పాఠం.

## 1. కాలుఊపుతూ

ఒక వ్యక్తికి కాలుఊపుతూ మాట్లాడటం అలవాటు. కాలు ఊపనిదే అతను మాట్లాడలేడు. అది అతని అలవాటు (మ్యానరిజం). ఇక చూడండి తమాషా...

నాయకుడు : (కుడికాలు ఊపుతూ ఇలా మాట్లాడుతున్నాడు) మిత్రులారా ఈ రోజు సుదినం. అంటే చాలా మంచి రోజు. ఎందుకంటే...

ఒకతను : సార్... ఈ కాలు ఊపడం కాస్త ఆపి చెప్పిండి సార్

నాయకుడు : (ఎడమకాలు ఊపుతూ...) ఎందుకంటే... ఎందరో మహానుభావులు ప్రాణత్యాగం చేసి...

మరోకతను : సార్! కాస్త ఆ కాలు కూడా ఊపడం ఆపి చెప్పండి (అతనికి కాలు ఊపనిది మాట్లాడటం రాదు అందుకని...)

నాయకుడు : మిత్రులారా... (అంటూ రెండు కాళ్ళు నిక్కబొడుస్తూ మాట్లాడ్తాడు)

## 2. సన్మానం

ఒకతను గత 2 సంవత్సరాలుగా వెంకటసుబ్బయ్య గారికి సన్మానం చేయాలని తిరుగుచున్నాడు. కాని వెంకటసుబ్బయ్య దొరకడం లేదు. ఎలాగో అలాగా చాలా కష్టపడి అతన్ని దొరకబట్టి తాళ్ళతో కట్టి సన్మాన సభకు తీస్కొని వచ్చాడు. స్టేజిమీద కూర్చోబెట్టి ఇలా స్పీచ్ ఇస్తున్నాడు. ఎంతో వ్యంగ్య విచిత్ర ధోరనిలో...

మిత్రులారా!

వెంకటసుబ్బయ్యకు సన్మానం చేయాలని 2 సంవత్సరాల నుండి తిరుగుచున్నాను. దొరకడంలేదు. ఇవ్వాల దొరికిండు. సన్మానం చేసి తీరుతా. మీ అందరికి తెలుసు. గత సంవత్సరం సుబ్బారావు గారికి సన్మానం చేసిన. ఆరునెల్లు తిరక్కముందే పోయిండు. మూడు నెలల క్రితం అప్పారావు గారికి సన్మానం చేసిన, నెల తిరక్కముందే పోయిండు. ఇవ్వల వెంకటసుబ్బయ్యకు సన్మానం చేసి తీరుతా... అంటు వెనక్కి చూశాడు. అంతే అక్కడ వెంకట సుబ్బయ్య కుర్చీలో లేడు....

## 3. గోకు కుంటూ

ఒకతనికి చాలా దురదగా ఉంది. ఒళ్లంతా గోక్కుంటూమాట్లాడు చున్నాడు. రాము, రంగ ఒక ఊళ్లో కలిసారు. ఇక చూడండి...

రాము : ఏరా, రంగా బాగున్నావా!

రంగ : (రెండు చంకల క్రింద రెండు చేతులతో గోక్కుంటూ) **ఆ... బాగున్నా**

రాము : ఏంటి ఇక్కడున్నావ్?

రంగ : **గిదే మా ఊరు.** (తల గోక్కుంటూ)

రాము : మీ ఊరా! ఎక్కడరా మీ ఇల్లు?

రంగ : (కుడి వైపు చూపిస్తూ కుడి చేతి చంక క్రింద గోక్కుంటూ...) **అటూ**

రాము : మన లెక్కల మాస్టార్ ఇంటికి వచ్చాను. ఎక్కడరా ఇల్లు?

రంగ : (ఎడమ వైపు చూపిస్తూ ఎడమ చేతి చంక క్రింద గోక్కుంటూ...) **ఇటూ.**

రాము : అవును! నీ పెళ్లటగా?

రంగ : (సంతోషంగా రెండు చేతులతో కోతిలాగా గోక్కుంటూ) **అవునూ...**

రాము : మీ అత్త ఊరుక్కెడ?

రంగ : (రెండుతొడల మధ్య గోక్కుంటూ) **గిక్కడా.**

(అంటే... అదే ఊరన్నమాట.)

## 3. ప్యాంట్ జారిపోతూ...

జారిపోతున్న తన ప్యాంట్‌ను పదే పదే పైకి అనుకుంటూ స్పీచ్ ఇస్తున్నాడు.

మిత్రులారా! మన దేశం ఎంతో కిందికి దిగజారిపోతున్నది. మనం ఎలాగైనా పైకి తీసుకురావాలి. కొంత మంది దుష్టులు, దుర్మార్గులు ఈ దేశాన్ని పట్టి కిందికి దిగజారుస్తున్నారు.

**గమనిక : 'దిగజారుస్తూ' అన్నప్పుడల్లా ప్యాంట్ కిందికి జారినట్లు యాక్షన్ జోడించాలి.**

## 5. సిగ్గేస్తుంది

ఒకావిడకు చాలా సిగ్గు. భర్తపోయిన తరువాత సంతాపసభ ఏర్పాటు చేశారు. ఆవిడ ఏమి మాట్లాడుతుందో ఆమెకే తెలియదు. ఆ సభలో మాట్లాడుతూ...

మీ అందరికి నమస్కారం చెప్పాలంటే... సిగ్గేస్తుంది. మిమ్మల్నందర్ని చూస్తుంటే నాకు చాలా సిగ్గేస్తుంది. మాట్లాడాలంటే ఇంకా సిగ్గేస్తుంది మా ఆయిన పోయిన తరువాత మా పనులన్నీ మా సెక్రెటరీ గారే చూస్కుంటున్నారు. ఆ విషయం చెప్పాలంటే సిగ్గేస్తోంది. అక్కడ కూర్చున్న ఆయన్ని చూస్తుంటే అచ్చం మా ఆయనలాగానే ఉన్నారు. ఆ విషయం చెప్పాలంటే సిగ్గేస్తోంది.

## 6. ఏమైనయి

ఒక ఊళ్లో తొమ్మిది రోజుల పాటు జాతర జరిగింది. ఆ సందర్భంగా ఊరి ప్రజలందరూ తలా కొంత ఇచ్చిన డబ్బును పోగు చేయగా లక్ష రూపాలయ్యాయి. ఆ లక్ష రూపాయలు ఎలా ఖర్చు చేశారు. ఏమయ్యాయని ఆ కమిటీలో నున్న సభ్యులందరూ ట్రెజరర్ గారిని అడగ్గా... అతను ఎలా ఖర్చు చేశాడో సభాముఖంగా తెలుపుచున్నాడు. అయితే మధ్య మధ్యలో కరెంటు పోతుంది. అతను తన స్పీచ్‌లో ఖర్చులను ఇలా వెల్లడించాడు.

గమనిక : చుక్... అన్నప్పుడల్లా కరెంటు కట్ అవుతుందని గమనించాలి. మైక్ క్లచ్ కట్ కావడం వలన ఎవరికి వినబడటం లేదు.)

ప్రజలారా! లక్ష రూపాయలు ఏమైనయ్.... ఏమైనయ్.... ఏమైనయ్ అని సభ్యులంతా నన్ను అడుగుతుండ్లు. లక్ష రూపాయల్లో జాతరలో గుడి దగ్గర టెంట్ సామాను, మైక్‌లకు, సీరియల్ బల్బ్‌లకు (చుక్...), అలా ఖర్చయితే మరీ వచ్చిన జనాలకు మంచినీళ్లకు గాను (చుక్...) ఆ విధంగా ఖర్చు అయినవి. మరీ ముఖ్యంగా 9 రోజులు మనం ఏర్పాటు చేసిన కల్చరల్ ప్రోగ్రామ్స్ కు (చుక్...) ఖర్చయితే, మిగిలిన పైసలు మనం క్రితం రోజు రాత్రి (చుక్...). ఆ విధంగా, లక్ష రూపాయలు అయిపోతే ఈ రోజు మరి పైసలు ఏమైనయ్... ఏమైనయ్... ఏమైనయ్ అని మళ్లీ అడుగుచున్నారు.

## 7. పురుగులు

రాత్రిపూట సభలు ఏర్పాటు చేసినపుడు చుట్టు ప్రక్కల ట్యూబ్‌లైట్స్ వెలుతురుకు దీపపు పురుగులు వచ్చి చేరుతుంటాయి. సభ ప్రారంభమై, ప్రముఖులు మాట్లాడే సమయంలో పురుగులు నోట్లోకి వచ్చి, చేరుతుంటే అందులో ఒకతను.

మిత్రులారా! ఈ రోజు చాలా మంచి థూ... దినం. ఎందుకంటే మన అప్పారావు థూ.... థూ... జన్మదినోత్సవం. ఎందరో నిరుద్యోగులకు, అభాగ్యులకు ఆదర్శప్రాయుడు యాక్... థూ... అప్పారావు తన జన్మదినం రోజు ఎందరో పేదలకు బట్టలు థూ.... లుంగీలు, లంగాలూ థూ... థూ... అవి కూడా దానం చేసిన అప్పారావు దానకర్ణుడు. అతన్ని మనసారా అభినందిస్తూ థూ... ఇలా నూరు వసంతాల పాటు జన్మదినోత్సవాలను జరుకోవాలని థూ... థూ... కోరుకుంటున్నాను.

## 8. జెండా వందనం

ప్రజలారా...

ఈ రోజు జెండా వందనం.

జెండా వందనం అంటే పంద్రా ఆగష్టు.

పంద్రా ఆగష్టంటే ఆగష్టు 15.

మిత్రులారా...

గస్సలు జెండా వందనం అంటే...?

జెండా వందనం అంటే... ?

జెండా... వందనం... అంటే...?

ఆ... నిన్న 14,

రేపు 16,

గీవ్వాల 15.

అదే పంద్రా ఆగష్టు.



# టెలివిజన్ కార్యక్రమాలు

# T.V. PROGRAMMES

వర్తమాన యుగంలో ఎన్నో రకాల ఎలక్ట్రానిక్ వస్తువులు వస్తున్నాయి. అందులో అతి ముఖ్యమైనది టి.వి. అని చెప్పవచ్చును. దృష్యశ్రవణాలకు సంబంధించిన ఈ ఉపకరణం సమస్త బ్రహ్మాండాన్ని తనలో ఇముడ్చుకుందనడంలో సందేహం లేదు. అట్టి టి.వి. దిన దిన ప్రవర్థమానమై అనేక చానళ్ళ ద్వారా, విస్తరిస్తున్న సమస్త విజ్ఞాన ప్రపంచాన్ని తను కూర్చున్న గదిలోనే మానవుడు దర్శించు కోగలుగుతున్నాడు.

ఇంతటి అద్భుతమైన ఉపకరణాన్ని ప్రతి వ్యక్తి తన అవసరాల కనుగుణంగా ఉపయోగిస్తున్నాడు. అదే విధంగా మిమిక్రీ కళాకారుడు కూడా ఏ మాత్రం అవకాశం చిక్కినా తన కళను, ప్రతిభను చాటు కోవడానికి దూరదర్శన్‌ను ఆశ్రయించడం తద్వారా ఆశేష ప్రజానీకానికి వినోదంతో పాటు విజ్ఞానాన్ని అందించడం జరుగుచున్నది.

1929లో బేయర్డ్ అనే ఇంగ్లాండ్ శాస్త్రవేత్త కనిపెట్టిన ఈ టి.వి. నేడు ప్రపంచంలోని ఎన్నో దేశాలకు సంబంధించిన వందలాది ఛానళ్లను ప్రసారం చేస్తూ ప్రపంచాన్ని వసుదైక కుటుంబంలా చేసిందని చెప్పవచ్చు.

## 1. ఇంటర్వ్యూ

సాధారణంగా మనం అనేక రకాల ఇంటర్వ్యూలు టి.వి.లో చూస్తుంటాం. ఈ సన్నివేశంలో ఇద్దరుంటారు. ఒకరు గెస్ట్ అనగా ఇంటర్వ్యూ ఇచ్చేవారు. మరొకరు హోస్ట్ అనగా ఇంటర్వ్యూ చేసేవారు. ఈ సన్నివేశంలో మాత్రం గెస్ట్‌ని ఏ సమాధానాలు చెప్పనీయకుండా హోస్ట్ ఎలా ఇంటర్వ్యూ చేస్తుందో హాస్యభరితంగా వివరించడం జరిగింది. ఈ ఐటమ్‌ని మిమిక్రీ కళాకారుడు చాలా స్పీడ్‌గా ప్రాక్టీస్ చేసి చెబితే ప్రేక్షకులు ఎంతో ఆనందిస్తారు.

ఇంటర్వ్యూ చేసే వారు కవిత. సమాధానాలు ఇస్తున్నవారు. డా॥ సాంబశివరావు గారు.

కవిత : దూరదర్శన్ ప్రేక్షకులకు నమస్కారం. చాలాకాలంగా తలనొప్పి అనేక మందికి వచ్చింది. వస్తోంది. అలా వస్తూనే ఉంటుంది. మరి తల నొప్పి రావటానికి గల కారణాలు ఏమిటని, అని తెలుపడానికి వచ్చారు ఈనాటి మన గెస్ట్ డా॥ సాంబశివరావు గారు.

కవిత : సమస్కారమండి డా॥ సాంబశివరావు గారు

డాక్టర్ : నమస్కారం.

కవిత : డాక్టర్ గారు అసలు తల నొప్పి అంటే ఏమిటండి?

డాక్టర్ : తలనొప్పి అంటే....

కవిత : అదేనండి తల బాగా నొప్పిగా ఉంటడం. హెడేక్ అన్నమాట.

డాక్టర్ : అవును.

కవిత : డాక్టర్ గారు, ఈ తల నొప్పి అంటే హెడేక్ ఎక్కువ ఎందు కొస్తుందంటారు.?

డాక్టర్ : ఎందుకొస్తుందంటే...

కవిత : టి.వి. కి దగ్గరగా కూర్చొని చూడటం వలన కానీ చాలా సేపు చూడటం వలన,.... కదండి డాక్టర్ గారు.

డాక్టర్ : అవునమ్మ.

కవిత : మరీ! డాక్టర్ గారు ఈ తలనొప్పి ఎలాంటి వారికి

వస్తుందంటారు.

డాక్టర్ : సాధారణంగా...

కవిత : కలుషిత వాతావరణంలో ఉన్నవారికి సిగరెట్లు బాగా త్రాగిన వారికి మందు కొట్టడం వలన చెడుగాలి, కాలుష్యం వలన కూడా చాలా మందికి ఈ తొలనొప్పి వస్తుదంటారు అంతేనా డాక్టర్ గారు?

డాక్టర్ : చాలా కరెక్ట్‌గా చెప్పారు.

కవిత : అయితే డాక్టర్ గారు ఇప్పుడు బ్లడ్‌లో హీమోగ్లోబిన్ అనే పదార్థము ఉంది కదా! దీనికి వాంతులవడానికి, కడుపు నొప్పి రావటానికి ఈ తలనొప్పికి సంబంధం ఉందంటారా?

డాక్టర్ : దానికి... దీనికి

కవిత : సంబంధం ఉండదు కదండి, అయ్యో డాక్టర్ గారు.. డాక్టర్ గారు.... డాక్టర్ గారు ఇలా పడిపోయారేంటి!?

## 2. ఉద్యోగ వార్తలు

నెం. I

కోటి రూపాయల పెట్టుబడితో రామోజినాయుడు నిర్మిస్తున్న "నరుకుతా నాగుండే" 12 యం.యం. 6 ట్రాక్ 3 స్ట్రోక్ 1 బ్రేక్ చిత్రానికి హీరోయిన్ కొరకు దరఖాస్తు కోరడమైనది. హీరోయిన్‌కు ఈ క్రింది అంశాలలో ప్రావీణ్యం ఉండాలి.

1. హీరోయిన్ అందంగా ఎత్తుగా నల్లగా దున్నపోతులా ఉండాలి.
2. ఒక కాలు కుంటిదై పరుగెత్తగలిగి ఉండాలి.
3. కరాటేలో ఈస్ట్‌మన్ కలర్ బెల్ట్ కలిగివుండాలి.
4. చదువు ఎల్.కె.జి. ఫెయిల్ అయి ఉండాలి.
5. క్రీస్తు పూర్వం పుట్టిన వారికి అధిక ప్రాధాన్యత ఇవ్వబడును.

మా అడ్రసు : గుంజీల గుర్నాధం
S/o. జగన్నాథం
కుక్కల కుంట,
నక్కలపాలెం,
చెక్కలూరు - 333 222 111

నెం. II

వరంగల్ జిల్లాలో పనిచేయుటకు కానిస్టేబుల్ పోస్ట్ కొరకు దరఖాస్తులు కోరుచున్నారు.

**అభ్యర్థికి కావలసిన కనీస అర్హతలు :**

1. గతంలో ఒకటి, రెండు దొంగతనాలతో సంబంధం ఉండాలి.
2. ముఖ్యంగా గాలిపీల్చితే ఛాతీ లోపలికి పోవాలి.

మా అడ్రసు : ఆపేట,
ఈ సందు,
ఏ ఊరు - 000 000.

నెం. III

అసెంబ్లీలో స్పీకర్ పదవికి దరఖాస్తు కోరుచున్నారు. కావలసిన అర్హతలు :

1. ప్రతి పక్షాలు కుర్చోన్న వైపు కన్ను పనిచేయకుండ ఉండాలి.
2. కూర్చొండి... కూర్చొండి.. కూర్చొండి... అని స్పష్టంగా అనగలిగి ఉండాలి.

## 3. కనిపించుటలేదు

**టి.వి.లో "కనిపించుటలేదు" అనే ప్రకటనను హాస్యంకోసం ఇలా చెప్పవచ్చు.**

గండయ్య అనే వ్యక్తి తండ్రి వళ్ళురాలగొట్టి ఇంటి నుండి పారిపోయాడట / గండయ్య నల్లగ దున్నపోతులా ఉంటాడు / వయస్సు 2 తక్కువ 10 సంవత్సరాలు. / ఎత్తు 4 తక్కువ 3 అంగుళాలుంటాడు./

బొమ్మ శ్రీనివాస్

ఇతను ఇంట్లో నుండి బయటకు వెళ్లేముందు ఒంటిపై బట్టలులేవట. / ఆచూకీ తెలిపిన వారికి 1000/- రూపాయలు. / ఇంటికి తీస్కొచ్చినవారికి 100 రూపాయలు బహుమతిగా ఇవ్వబడును.

## 4. హాస్య జన్మభూమి

నెం. I

ఒక వ్యక్తి : నమస్కారం సార్

ముఖ్యమంత్రి : నమస్కారం, చెప్పండీ.......

వ్యక్తి : అంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారేనా మాట్లాడేది?

ముఖ్యమంత్రి : హా! మీ పేరు చెప్పండి?

వ్యక్తి : చంద్రబాబు

ముఖ్యమంత్రి : నాపేరు కాదు మీ పేరు చెప్పండి.

వ్యక్తి : నా పేరు కూడ చంద్రబాబండి.

ముఖ్యమంత్రి : చూడండి చంద్రబాబు గారు మీ సమస్య ఏంటో చెప్పండి.

చంద్రబాబు : ఏం చెప్పమంటవ్ సార్... నేను నల్గొండ నుండి మాట్లాడుచున్నాను. మా వీధిలో కరెంటు ఎప్పడు పడితే అప్పడు పోతుంది. సార్ ఎప్పడు పోతుందో, ఎప్పడు వస్తుందో ఒక టైం అంటులేదు సార్. మాకు చాలా ప్రాబ్లమ్‌గా ఉంది. మీరు వెంటనే పరిష్కరించాలి సార్.

ముఖ్యమంత్రి : నేను వెంటనే ఎ.ఇ. గారితో మాట్లాడతాను.

చంద్రబాబు : మీరు పోయిన వారం ఇలాగే చెప్పారు సార్

ముఖ్యమంత్రి : ఈసారి తప్పకుండా చెబుతాను. ఇంతకు మీరేం చేస్తారు.

చంద్రబాబు : నేనా ! నల్గొండ కరెంట్ ఆఫీస్‌లో 'లైన్‌మెన్'ని.

## నెం. II

శ్రీను : హలో

ముఖ్యమంత్రి : హా... చెప్పండి.

శ్రీను : సార్.. మా ఊళ్లో జన్మభూమి, శ్రమదానం కార్యక్రమాలు చాలా ఉధృతంగా మొదలెట్టాం.

ముఖ్యమంత్రి : చాలా సంతోషం. మీరు చాలా మంచి పని చేశారు. ఇంతకీ మీ సమస్య ఏంటో చెప్పండి.

శ్రీను : అయితే సార్..జన్మభూమికి, శ్రమదానంకి తేడా ఏంటిసార్?

ముఖ్యమంత్రి : మీరు బండ గుర్తు పెట్టుకోవాలి.
జన్మభూమి అంటే మొక్కలు నాటడం.
శ్రమదానం అంటే మొక్కలు పీకడం.

## నెం. III

ముఖ్యమంత్రి : హలో... చెప్పండి

రాజు : సార్...మీరు-నీరు కార్యక్రమము చాలా బాగుంది చాలా శ్రమించాము. ఆ తరువాత జన్మభూమి కార్యక్రమము పేరు చెబుతారా?

ముఖ్యమంత్రి : మీరు శ్రమించారని చెప్పారు, అందుకోసం ప్రత్యేక జన్మభూమి కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాను.

రాజు : అదేంటి సార్ ?

ముఖ్యమంత్రి : మీరు-బీరు

## నెం. IV

శనేశ్వర్రావు : సార్, నేను గుంటూర్ నుండి మాట్లాడుతున్నాను.

ముఖ్యమంత్రి : ఆ....చెప్పండి!

బొమ్మ శ్రీనివాస్

శనేశ్వర్రావు : సార్, నేను అపరేషన్ చేయించుకున్నా కూడ పిల్లలు పుడుతున్నారు. మరి నేనేం చేయాలి?

ముఖ్యమంత్రి : ఆపరేషన్ చేయించున్నాక పిల్లలు పుట్టకూడదు, అయినా మీరు పుట్టారని చెప్తారు. చూడండి...... శనేశ్వర్రావుగారూ, మీ పేరులోనే ఉంది శనంతా. ఈ ఆపరేషన్ అనేది మీరొక్కరే కాదు, మీ యింటి చుట్టుపక్కల వాళ్లంతా చేయించుకుంటే మంచిది.

## 5. మహామంత్రి జన్మభూమి

నెం. I

సంతోష్ : సార్, నేను వరంగల్ నుండి మాట్లాడుతున్నాను.

మహామంత్రి : ఆ.. చెప్పండీ.....

సంతోష్ : సార్, మా ఊళ్ళో కోళ్లన్నీ గుడ్లు పెడ్తన్నయ్ సార్, కానీ పిల్లల్ని చేయడం లేదు, మరి మేమేం చేయాలి, సార్!

మహామంత్రి : మీరు 21రోజులు కనుక గుడ్ల మీద కూర్చొపెట్టిన ట్లయితే తప్పకుండా పిల్లలౌతాయని మనవి చేస్తున్నాను.

సంతోష్ : సార్, 21రోజులు చూసినం సార్, అయినా కూడ పిల్లలు కాలేదు.

మహామంత్రి : మీకు వీలైతే మీరే పొదగండి!

సంతోష్ : అట్ల చేసినా కూడ పిల్లలు కాలేదు, సార్!

మహామంత్రి : 20వ జన్మభూమి కార్యక్రమం లోపల నేను మీ ఊరికి వచ్చినపుడు నేనే పొదుగుతాను.

నెం. II

| | | |
|---|---|---|
| ముసలమ్మ | : | ఓ.. బిడ్డా! |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! |
| ముసలమ్మ | : | ఓ.. బిడ్డా! (దీర్ఘంగా) |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! (దీర్ఘంగా) |
| ముసలమ్మ | : | ఓ.. బిడ్డా! (మరింత దీర్ఘంగా) |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! (మరింత దీర్ఘంగా) |
| ముసలమ్మ | : | ఏం చెప్పాలి బిడ్డా! మా పెద్దకొడుకు దిక్కుమల్ల సాయిత పట్టి కొంపంత నాశనం చేత్తాండు బిడ్డా! |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! |
| ముసలమ్మ | : | ఇగ, రెండో కొడుకు బిడ్డా, ఆ తాగుడు పాడుగాను, తాగి, తాగి కొంపంత గుల్ల చేశిండు బిడ్డ! |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! |
| ముసలమ్మ | : | ఇగ, నా పెనిమిటి బిడ్డ, వాని దిక్కుమల్ల సుట్ట పాడుగాను, ఆ సుట్ట తాగి, పత్తి లేస్తే, పత్తంతా కాలి పోయి గుడిశంతా తగులబడ్డది బిడ్డా! |
| మహామంత్రి | : | ఆ.. చెప్పండి! |
| ముసలమ్మ | : | ఇంకేం చెప్పాల్రా ముండకొడుకా! నీ ఇంట్ల పీనుగెల్ల. |

## 6. సవరణ

ఒక పెద్ద మనిషి చనిపోకముందే తప్పుడు సమాచారం అందడం వలన టి.వి. వారు చనిపోయారని ఫోటో వేసి చూపించారు.

ఆ విషయం తెల్సిన పెద్దమనిషి వెంటనే మరుసటిరోజు వార్తలలో క్షమాపణ చెప్పాలని, లేకుంటే కోర్టు కీడ్చి పరువునష్టందావా వేస్తానని చెప్పాడు. మరుసటి రోజు టి.వి. వార్తలలో ఇలా చెప్పారు.

"నిన్న చనిపోయారని మేము ప్రకటించిన ఫలానా పెద్దమనిషి చనిపోలేదని తెలియజేయుటకు చింతిస్తున్నాము."

# 7. శాంతి స్వరూప్

దిల్‌సుక్‌నగర్, విద్యానగర్, అంబర్‌పేట, రాంనగర్, నల్లకుంట మొదలగు ప్రాంతాలలో నీటి సరఫరా బందుంటుందని, నగర మున్సిపల్ కమీషనర్‌గారు పేర్కొన్నారు.

(అని చాలా స్పీడ్‌గా ఎక్కడా ఆపకుండా చెప్పి, ఇదేవార్తను మన శాంతిస్వరూప్‌గారు ఎంతో శాంతంగా ఈ క్రింది విధంగా చెబుతారు.)

దిల్‌సుక్‌నగర్...

విద్యానగర్...

అంబర్‌పేట...

రాంనగర్...

నల్లకుంట...

మొదలగు ప్రాంతాలలో...

నీటి సరఫరా... బందు ఉంటుందని...

నగర ...మున్సిపల్ కమీషనర్‌గారు...

పేర్కొన్నారు.

ఈరోజు ఉష్ణోగ్రతా వివరాలు... ఇలా ఉన్నాయి.

హైద్రాబాద్ : అందలేదు

విజయవాడ : అందుతుంది

తిరుపతి : అందాల్సి ఉంది

(మనం ప్రోగ్రాం చేస్తున్న జిల్లా పేరు చెప్పి, ఉదాహరణకు)

వరంగల్ ; మీ అందరికి తెలుసు.



# సినీమా నటుల జోక్స్
# JOKES OF CINE ACTORS

## జోక్ నెం. 1

రావుగోపాలరావు తన కొడుకైన కృష్ణ గారికి అనేక పెళ్లి సంబంధాలు చూసి విసుగు చెంది చివరికి ఇలా చెబుతున్నారు.

రావుగోపాలరావు : నాయనా కృష్ణ/ నేను చూపిన ఆ సుజాత/ గుణవతి/ రూపవతి/ శీలవతి /నువ్వు తప్పకుండా పెళ్లి చేస్కోవాలి/ హు.. హు.../ నువ్వు నాకేం చెప్పొద్దు.

కృష్ణ : నాన్న గారు/ మీరు చూసిన సుజాత గుణవతి, రూపవతి, శీలవతి మాత్రమే కాదు. ఐ మీన్ గర్భవతి కూడా...

## జోక్ నెం. 2

ముగ్గురు హాస్య నటులు ఒక ట్రైన్‌లో వెళుచున్నారు. అందులో రాజబాబు ఎదురుగా రేలంగి ఇద్దరు చెరో కిటికి ప్రక్కన కూర్చున్నారు. ఆ రెండు కిటికీలు సగం మాత్రమే తెరచి ఉన్నాయి. వీరి పక్కనే సుధాకర్ గారు కూర్చున్నారు.

రాజబాబు : 'ఆ.../ ఆ.... కిటికి పూర్తిగ తెరిస్తే / ఆ.. నేను చచ్చిపోతా! /అసలే నాకు ఉబ్బసం/ అయ్యబాబోయ్'

రేలంగి : నాకసలే ఆయసం / ఆ కిటికి పూర్తిగా మూస్తే /నేను చస్తా / జంబలకిడి పంబ.

బొమ్మ శ్రీనివాస్

సుధాకర్ : నీ అబ్బా/ ఏమిట్రా మీ గొడవ / ఆ కిటికి ఒకేసారి మూసి తెరవండి / నీయబ్బ / ఇద్దరు చస్తారు

## జోక్ నెం. 3

శోభనం గదిలో చిరంజీవి గారు ఆయన భార్యతో మాట్లాడుతూ...

చిరంజీవి : ప్రేమించిన నిన్ను చేస్కోవడం నిజంగా ఐయామ్ లక్కీ.. ఐ లవ్ యూ

భార్య : అబ్బా! నాకు ఇంగ్లీష్ రాదండి

చిరంజీవి : ఈ శోభనం రాత్రి / ఈ పండు వెన్నెల్లో / చందమామ లాంటి నీ ముఖం చూస్తుంటే / నాకు ఏమన్పిస్తుందో తెలుసా?

భార్య : నాకు తెలుగు కూడా అంతగా తెలియదండి.

చిరంజీవి : అది కాదె! / ఈ రాత్రి నిన్ను అమాంతం ఆకాశంలోకి ఎత్తుకెళ్లి / ఆ నక్షత్రాల మధ్య కూర్చోపెట్టి / ఆ గ్రహ గోళాలపై నిన్ను...

భార్య : అబ్బా... నాకు సోషల్ కూడ రాదండి

చిరంజీవి : ఏంటి! / ఇలా ప్రతి దానికి ఏమి రాదని చెబుతున్నావు? / చెప్పు / ఇలా చెప్పమని ఎవరు చెప్పారు / మీ బామ్మ / లేక ఇంతకు ముందు ప్రేమించినవాడా? / ప్రేమిస్తే / ఎంత మందిని ప్రేమించావు?

భార్య : నాకు సరిగ్గా లెక్కలు కూడా రావండి.

## జోక్ నెం. 4

నూతన్‌ప్రసాద్ : వసే పంకజం

భార్య : ఏంటండి

నూతన్‌ప్రసాద్ : ఈ రోజు ఆ బ్రహ్మానందం, / ఎల్.బి. శ్రీరామ్‌లని / భోజనానికి పిలిచాను / ఈ కలర్ టి.వి., / టేప్‌రికార్డ్,

| | | |
|---|---|---|
| | | ఆ టేబుల్ ఫ్యాన్/ రేడియో / లోపలి గదిలో దాచేయ్/ |
| భార్య | : | ఆ దొంగ వెధవలను ఎందుకు పిలిచారండి భోజనానికి |
| నూతన్‌ప్రసాద్ | : | వాళ్లు ఎత్తుకెళ్తారని కాదు... / వాళ్ల వస్తువులు వాళ్లు గుర్తు పట్టరూ. |

## జోక్ నెం. 5

| | |
|---|---|
| ఎల్.బి. శ్రీరామ్ | : డాక్టర్ బాబు... డాక్టర్ బాబు.. / మీరే కాపాడాలి |
| డాక్టర్ | : ఆ ఏమైంది శ్రీరామ్ గారు. |
| ఎల్.బి. శ్రీరామ్ | : నాకు కాదు.... / మా ఆవిడ కయ్యింది. |
| డాక్టర్ | : ఏమైంది |
| ఎల్.బి. శ్రీరామ్ | : ఏం చెప్పమంటారండి / రోజు కొ...కొ...కొ..కొ... అని కోడిలాగ అరుస్తుంది / ఇల్లంతా తిరుగుతుంది. / ఒక్కొక్కసారి ఇల్లు ఎక్కుద్ది. |
| డాక్టర్ | : గంప కింద కూడ కూర్చొంటుందా |
| ఎల్.బి. శ్రీరామ్ | : బాగా గుర్తు చేశారండి |
| డాక్టర్ | : ఎప్పటి నుండి ఈ జబ్బు వచ్చింది. |
| ఎల్.బి. శ్రీరామ్ | : 15 రోజులవుతోంది. |
| డాక్టర్ | : మరి 15 రోజుల నుండి ఏం చేశారండి |
| ఎల్.బి. శ్రీరామ్ | : ఆ.../ గుడ్డు గిట్ల పెడతదో / చూశానండి. |

## జోక్ నెం. 6

| | | |
|---|---|---|
| సుధాకర్ | : | అబ్బా! / నీ యబ్బ / పిచ్చికొట్టుడు కొట్టాడురా! / ఎవడండీ వాడు / టైం అడుగుతే / కడుపులో / ఒక గుద్దు గుద్ది వెళ్లిపోతున్నాడు / అయ్యో.. |
| నూతన్‌ప్రసాద్ | : | యావ్ ... / ఎవడు...? / వాడా / వాడు ఐరన్‌లెగ్ శాస్త్రి / పాపం మూగవాడు / టైం అడుగుతే అలాగే గుద్ది చెబుతాడు. / నిన్ను ఒక్క గుద్దు గుద్దాడు / |

కనుక ఇప్పుడు సమయం ఒంటి గంట అవుతుందని అర్థం / యావ్...

సుధాకర్ : అయ్యో బాబోయ్

నూతన్‌ప్రసాద్ : ఏమిటయ్యా

సుధాకర్ : గంట ముందడిగితే.. / యహో... / నేనేమయ్యే వాడినో.

## జోక్ నెం. 7

**రావుగోపాలరావు గారు బ్యాంక్ మేనేజరు. సుజాత బ్యాంక్‌లో క్యాషియర్. చాలా కాలంగా మేనేజరు సుజాతను పరిశీలిస్తూ ఒక రోజు పిలిచి ఇలా అడుగుతున్నాడు.**

రావుగోపాలరావు : చూడు సుజాత, / నేను చాలా కాలం నుండి / ఒక విషయం నిన్నడుగుదామనుకుంటున్నాను.

సుజాత : పరవాలేదు ఏంటో చెప్పండి

రావుగోపాలరావు : నువ్వు సోమవారం నుండి శుక్రవారం వరకు చీర కట్టుకుని వస్తావు / కాని /శనివారం మాత్రం మిడ్డి వేస్కోని వస్తున్నావు/ దీనికి కారణం ఏమైనా ఉందా.

సుజాత : మేనేజర్ గారు... సోమవారం నుండి శుక్రవారం వరకు ఫుల్‌డే కదండి అందుకని ఫుల్ డ్రెస్ వేస్కొంటాను. శనివారం ఆఫ్‌డే కదండి అందుకని ఆఫ్ డ్రెస్ వేస్కొంటాను.

రావుగోపాలరావు : చాలా సంతోషం. / రేపు ఆదివారం సెలవు / ఆఫీస్‌లో కాస్తపనుంది / నువ్వు తప్పకుండా రావాలి.

## జోక్ నెం. 8.

బాబుమోహన్ : అన్నా... / నీకో శుభవార్తన్నా!

యం.ఎస్. నారాయణ : ఏంటది?

బాబుమోహన్ : లేచిపోయిన నీ భార్య /
ఇహ్హిహ్హిహ్హి / తిరిగొచ్చిందన్నా.

## జోక్ నెం. 9

శ్రీరామ్ : డాక్టర్ గారు..../ కడుపులో చాలా నొప్పిగా ఉందండి

నూతన్‌ప్రసాద్ : అలాగా! ఎప్పటి నుండి

శ్రీరామ్ : ఆదేనండి.... / రాత్రి మీరిచ్చిన మాత్రేసుకున్న దగ్గరి నుంచీ

## జోక్ నెం. 10

సుధాకర్ హోటల్ రూంలో నిద్రపోతున్నాడు. రూం బాయ్ ఆలీ వచ్చి....

ఆలీ : హలో... / ఎక్స్‌క్యూమి సార్.../ మిమ్మల్ని నిద్రలేపమన్నది
6 గంటలకా / 7 గంటలకా.

సుధాకర్ : ఎన్నిసార్లు చెప్పాలిరా! / 8 గంటలకని / ఇంతకి /
ఇప్పుడు ఎంత అయ్యిందిరా టైం!

ఆలీ : తొమ్మిది సార్!

## జోక్ నెం. 11

సుధాకర్ ఆఫీసు అయిపోయాక టేబుల్ ముందు కూర్చుని విపరీతంగా మందు కొట్టాసాగాడు.

| | | |
|---|---|---|
| ఎల్.బి.శ్రీరామ్ | : | ఎందుకురా...? / అంత విపరీతంగా త్రాగుచున్నావ్? |
| సుధాకర్ | : | అయ్యో! / ఏం చెప్పమంటావురా! / నా భార్య నాతో గొడవపడి / నెలరోజుల వరకు తిరిగి రానని / పుట్టింటికి / వెళ్లిపొయిందిరా... |
| ఎల్.బి. శ్రీరామ్ | : | భార్య పుట్టింటికి పోతే / సంతోషంతో పార్టీ చేసుకోవాలి కాని / నీవేంట్రా బాధతో మందు కొడుతున్నావ్...? |
| సుధాకర్ | : | నీ యబ్బ! / ఇవ్వాల్టికి / నెలైందిరా! |

## జోక్ నెం. 12

ప్రతిరోజు క్లబ్‌లో పేకాట ఆడి వస్తున్న కొడుకుతో తండ్రి దగ్గరిగా కూర్చొబెట్టుకొని హితబోధ చేస్తూ....

| | | |
|---|---|---|
| రావుగోపాలరావు | : | చూడు బాబూ...! / పేకాట ఆడటం మంచిది కాదు /దాని వల్ల ఈ రోజు డబ్బు వస్తుంది / రేపు పోతుంది / ఎల్లుండి వస్తుంది / అవలెల్లుండి పోతుంది / ఇప్పటికైనా నా మాట విని మానుకో. |
| కృష్ణ | : | అందుకే నాన్నా గారు / దినం తప్పి దినం ఆడుతున్నా...? |



# జోక్స్

# JOKES

నవ్వుతూ బ్రతకాలిరా తమ్ముడు.. నవ్వుతూ చావాలిరా అన్నాడు ఓ సినీ కవి. నేను ఎందుకు నవ్వుతున్నానంటే ఏడవడం చాతకాదు అన్నాడు అబ్రహాంలింకన్. హాస్య రసాన్ని ఆస్వాదించ లేకపోతే నేను ఏనాడో ఆత్మహత్య చేస్కునే వాడ్ని అని అన్నాడు మహాత్మాగాంధి.

నవ్వు నాలుగు విధాల చేటు అన్నది పాత మాట. నవ్వు నాలుగు విధాల గ్రేటు అన్నది కొత్తమాట. నవరసాల్లో అందరినీ అలరించేది హాస్యరసం మాత్రమే. అందుకే నవరసాల్లో ఒక్క హాస్యరసం మాత్రమే ప్రజల్ని ఆకర్షిస్తుందనడంలో సందేహం లేదు.

కొందరు జోక్స్ చెబుతున్నప్పుడు ఎక్కువగా నవ్వురాక పోవచ్చు. దానికి ప్రధాన కారణం వారికి జోక్ చెప్పరాకపోవడమే. అన్ని గొంతులను ఒకే బాణిలో చెప్పడం వలన ఎక్కువ హాస్యం ధ్వనించదు.

కాని మిమిక్రీ కళాకారుడు జోక్స్ చెబుతున్నప్పుడు మాత్రం ప్రేక్షకులు నవ్వుల సముద్రంలో మునిగి తేలుతుంటారు. ఎందుకంటే మిమిక్రీ కళాకారుడు అక్కడ ఎంత మంది పాత్రలుంటే అన్ని రకాలుగా గొంతు మార్చి చెప్పడం వలన స్పష్టంగా జోక్స్ అర్థమయి ఇంకా ఎక్కువగా హాస్యం ధ్వనిస్తుంది.

సినీనటుల జోక్స్ మరియు ముందు చాప్టర్‌లో జోక్స్ చెబుతున్నామంటే ప్రధానంగా ఆ గొంతులను మనం స్పష్టంగా ఉచ్చరించగలిగి అనుకరించగలిగే శక్తి తో పాటు ఆ వాయిస్ మీద కమాండింగ్ ఉన్నప్పడే మిమిక్రీ కళాకారుడు జోక్స్‌ని చెప్పగలడు.

బొమ్మ శ్రీనివాస్

## 1. ముగ్గురు ఫ్రెండ్స్

ముగ్గురు స్నేహితులు ఒక పడవలో ప్రయాణం చేస్తున్నారు. ప్రమాదవశాత్తు ఆ పడవ నీటిలో మునిగిపోయింది. అందులోని ముగ్గురు ఫ్రెండ్స్ ఈదుకుంటూ ఒక దీవిని చేరుకున్నారు. ఆ దీవినీ చేరుకోగానే అందులో ఒకతను చూడకుండా అక్కడున్న ఒక ప్రమిదను తొక్కేశాడు. ఆ దీపాన్ని తొక్కీతొక్కగానే అందులో నుండి ఒక పెద్ద భూతం వచ్చింది. ఆ భూతం వచ్చేసి మీ ముగ్గురికి ఒక్కొక్క వరం ఇస్తున్నాను. ఏం కావాలో కోరుకోండన్నది.

మొదటివాడు : ఈ పడవ మునిగి ఎక్కడున్నదో నాకు తెలియదు. నాకు ఆకలి బాగా అవుతున్నది. నేను వెంటనే హైద్రాబాద్ అల్ఫా హోటల్‌లో బిర్యాని తింటుండాలి అన్నాడు.

**(వెంటనే మాయమైపోతాడు.)**

రెండవవాడు : నేను దేవి టాకీస్‌లోసినిమాచూస్తుండాలన్నాడు.

**(అతను మాయమైపోయాడు.)**

**మూడో వ్యక్తికి చాలా బోర్ కొడుతుంది.**

భూతం : "నీకేం కావాలి" అని అడగ్గా...

మూడోవ్యక్తి : ఇప్పుడు పోయిన, నా ఇద్దరు ఫ్రెండ్స్, వెంటనే నా దగ్గరకు తిరిగి రావాలి.

**(బిర్యాని తినకుండా ఒకడు, సిన్మా చూడకుండా మరొకడు, వెంటనే వచ్చేశారు.)**

## 2. హోటల్

రాజు : హోటల్‌లో వేడిగా ఏమి ఉన్నాయి?

సర్వర్ : ఇడ్లీ

రాజు : ఇంకా వేడిగా...

సర్వర్ : ఉప్మా

రాజు : ఇంకా వేడిగా

సర్వర్ : వడ
రాజు : ఇంకా... వేడిగా...
సర్వర్ : పూరి
రాజు : ఇంకా వేడిగా.....
సర్వర్: చాయ్
రాజు : ఇంకా.. వేడిగా...
సర్వర్: నిప్పలున్నాయి
రాజు : ఒక ప్లేట్ పట్టుకొనిరా... (రాగానే...)
(సిగరెటు వెలిగించుకొని) థ్యాంక్స్ అంటూ వెళ్లిపోతాడు.

## 3. బస్‌స్టాండ్

బక్కడు బస్‌స్టాండ్‌లో చాలా పరేశాన్‌గా అటు ఇటుగా చూస్తూ జేబులు తడుముకొంటున్నాడు. రిక్కడు అది గమనించి....

రిక్కడు : అరె! ఎంది సార్ పరేశానుగా ఉన్నావు? ఏమైంది
బక్కడు : ఎవరండి మీరు? ఏమైతె మీకెందుకు?
రిక్కడు : ఆరె! పరేశానులో ఉన్నావు గదా! సహాయం చేద్దామని వచ్చిన! చెప్పు ఏమైంది?
బక్కడు : జేబు నుంచి 500 రూపాయలు జారిపోయినవి! నువ్వు ఇస్తావా!
రిక్కడు : బస్సుస్టాండ్‌ల గింతమంది ఉన్నరు. 5 వందల రూపాయలు దొరుకుతాలేవా బై!
బక్కడు : ఉంటే.... ఎవరిస్తారండి.
రిక్కడు : ఎవ్వడెందుకు ఇస్తాడు బై! మెల్లిగ పోవాలి జేబు కత్తిరించాలి.
బక్కడు : జేబు కత్తిరిస్తే వాళ్లు ఊరుకుంటారా! దౌడపండ్లు రాలగొట్టరు?
రిక్కడు : ఎందుకు రాలగొడ్తరు!
బక్కడు : అంటే.... పర్సు కొట్టేస్తే తన్నరా!
రిక్కడు : ఎందుకు తంతరు బై. అర్ధగంట అయ్యింది నీ పర్స్ కొట్టి. నువ్వు నన్ను కొట్టినవా!

## 4. బస్ టికెట్స్

| | | |
|---|---|---|
| కండక్టర్ | : | టికెట్....టికెట్....టికెట్.... |
| అయోమయం | : | కండక్టర్ గారు దిల్‌సుఖ్‌నగర్‌కు రెండు టికెట్స్ ఇవ్వండి. |
| కండక్టర్ | : | ముందు ఫ్యామిలి ఉందా సార్? |
| అయోమయం | : | ఫ్యామిలి లేదు. నాకే రెండు టికెట్స్ ఇవ్వండి. |
| కండక్టర్ | : | అరె చాలా గమ్మతుగున్నవ్ బై, నువ్వు |
| అయోమయం | : | ఎందుకు? |
| కండక్టర్ | : | ఇవ్వాల రేపు టికెట్టు ఎవ్వరు తీస్కుంటలేరంటే, మీరు రెండు టికెట్స్ కొంటున్నారు. మరి గమ్మత్తు కాక ఏంటిది బై. ఇంతకి రెండు టికెట్స్ దేనికి సార్? |
| అయోమయం | : | అరె ఇవ్వాల్రేపు రోజులు బాగాలేవు. బద్మాశ్‌లు ఉన్నరు, దొంగలున్నరు, జేబుదొంగలున్నరు. చెకింగ్ అవుతుంది.అందుకని ఒక టికెట్ పోతె ఇంకో టికెట్ ఉంటుంది. |
| కండక్టర్ | : | సార్ ఒక చిన్న డౌట్ |
| అయోమయం | : | ఏంటిది బై? |
| కండక్టర్ | : | ఒకవేళ రెండు టికెట్స్ పోతే? |
| అయోమయం | : | నేనే మన్నా పిచ్చోడిలాగ అగుపడతాన్నా... నాదగ్గర బస్‌పాస్ ఉంది. |
| కండక్టర్ | : | గట్లనా సార్.. గీ బస్‌పాస్ కూడా పోతే.... |
| అయోమయం | : | పిచ్చి గాడిద కొడుకా... ఆర్.టి.సి. డిపోలో పని చేస్తున్న, నన్నెవడురా పట్టుకొనేది. |

## 5. తలనొప్పి జోక్

| | | |
|---|---|---|
| సుబ్బారావు | : | వరె! ఈ మధ్య అస్థమానం తలనొప్పి మాటి మాటి కొస్తుందిరా! |
| అప్పారావు | : | వరె! ఈ తలనొప్పి ఇలా మాటి మాటికి రాకూడదు. ఒకసారి నాకు ఇలాగే వస్తే ఏం చేశానో తెలుసా! |

సుబ్బారావు : ఏం చేశావురా?

అప్పారావు : తలకు జెండూబామ్ రాసి, మా ఆవిడ ఒళ్ళో గుర్రుపెట్టి పడుకున్నాను. అంతే తలనొప్పి మటుమాయం.

సుబ్బారావు : అలాగారా! అయితే నేనూ జెండూబామ్ రాస్కొని వస్తాను. ఇంతకు మీ ఆవిడ ఎక్కుడుందిరా!

## 6. నర్సమ్మ జోక్

సాధారణంగా సిటీలో ఎక్కువగా సినిమా థియేటర్ల పేర్లు మనుష్యుల పేర్లే పెడుతుంటారు. అయితే బస్సు ఎక్కి కండక్టర్‌ని కొందరు ఇలా టికెట్ అడుగుచున్నారు.

ఒకతను : మనోహర్ ఒక టికెటివ్వండి.

మరొకతను : సుదర్శన్ ఏక్ టికెట్ దేవ్ బాయ్.

ఒకవిడా : సంధ్య ఒక టికెట్ ప్లీజ్

మరొకవిడ : దేవి ఒక టికెట్ ఇవ్వండి.

ఒక నిరక్షరాస్యురాలు బస్సు టికెట్ పేరు చెప్పి తీస్కోవాలి కాబోలు అని భావించి...

నిరక్షరాస్యురాలు : నర్సమ్మ ఒక టికెట్ ఇవ్వు....

## 7. అత్తా-కోడలు సంభాషణ

కోడలు : దొంగ సచ్చినోడు... రోజు తాగి తందాన ఆడుతాండు. ఆడపిల్ల ఉందన్న ద్యాసేలేదు. వీడు ఎప్పుడు సత్తడో ఏందో....

అత్త : ఏందే.... ఎట్టెట్ట... నాకొడుకును చావమంటావే... నీతాడు తెగ...

## 8. క్రికెట్ జోక్

ఇండియా క్రికెట్ ఒక్కోసారి ఓడిపోతుంది. ఓడిపోయింది. అలా వరసగా ఓడి పోతూనే ఉంటుంది. ప్రజలంతా ఎక్కడ క్రికెటర్ కన్పిస్తే తందామని చూస్తున్న టైంలో అజారుద్దీన్ గారింట్లో కూరగాయలు అయిపోయాయి. పనివాళ్లంతా లీవ్‌లో ఉన్నారు.

అజారుద్దీన్ : ఇప్పుడెలాగా! కూరగాయలు ఎవరు తెస్తారు! బయట వాతావరణం ఏం బాగాలేదు.

సంగీతా : ఏం పరవాలేదు. దానికో ఉపాయం ఉంది. మీ మాజీ భార్య బురఖా ఉంది కదా దాన్ని ధరించి మార్కెట్‌కు వెళ్లండి మిమ్మల్ని ఎవరు గుర్తుపట్టరు.

అజారుద్దీన్ : తప్పదు, ఏం చేద్దాం.

అంటూ మార్కెట్‌కు వెళ్లారు, కాని అక్కడ ఒకావిడ అతన్ని గుర్తించి ఇలా అడిగింది.

ఆవిడ : మీరు అజారుద్దీన్ కదండీ!?

అజారుద్దీన్ : అరే! మీకెలా తెలుసు!

ఆవిడ : నేను! అజయ్‌జడేజాను.

## 9. ఉద్యోగం

మన తెలుగు సిన్మాలలో కొన్ని సన్నివేశాలు నవ్వుల పాలై నవ్వు పుట్టిస్తుంటాయి దానికి ఉదాహరణ...

కొడుకు : అమ్మ.... అమ్మ నాకు ఉద్యోగం వచ్చిందమ్మా.

తల్లి : ఎక్కడ బాబు?

కొడుకు : హైద్రాబాద్‌లో అమ్మ.

తల్లి : ఏ కంపనీ నాయనా!

కొడుకు : నాగరాజు టింబర్ డిపో.

తల్లి : బా.... బు.... (దీర్ఘంగా రోదిస్తూ....)

కొడుకు : అమ్మ... ఏమైందమ్మ?

తల్లి : ఆ నాగరాజు ఎవరో కాదు బాబు. నా పసుపు కుంకుమలు చెరిపింది వాడే బాబూ...

కొడుకు : అమ్మ.... వాడ్ని ముక్కలు ముక్కలుగా నరికి కుక్కలకు, నక్కలకు వేస్తాను.

తల్లి : వద్దు బాబు... వద్దు. నా పసుపు కుంకుమలు చెరిపింది వాడె అయినా, నీ జన్మకు కారణం వాడే బాబూ.

## 10. పారా చూట్ జోక్

ఒక విమానం కొద్దిసేపట్లో కూలిపోతుంది, 'అందరూ పారాచూట్స్ అందుకొని కిందికి దూకండి' అని మైక్‌లో అనౌన్స్ చేయగానే అందరు దూకేశారు. చివరిగా ఒక ఉపాధ్యాయుడు, ముగ్గురు పిల్లలు ఉన్నారు. కాని మూడు ప్యారాచూట్స్ మాత్రమే ఉన్నాయి.

ఉపాధ్యాయుడు : మీ ముగ్గురు ఆ మూడు పారాచూట్స్ తీస్కొని దూకేయండి అనగానే ఇద్దరు వెంటనే దూకేశారు.

విద్యార్థి : మీరు కూడ పారాచూట్ కట్టుకొని దూకండి మాస్టర్

ఉపాధ్యాయుడు : నా వయస్సు అయిపోయింది. నా కోరికలన్నీ తీరాయి. నీకెంతో భవిష్యత్తుంది. నువు దూకేయి.

విద్యార్థి : లేదు మాస్టర్. మనం ఇద్దరం దూకటానికి రెండు పారాచూట్స్ ఉన్నాయి.

ఉపాధ్యాయుడు : అదెలాగా?

విద్యార్థి : రాజు గాడు ప్యారాచూటు అనుకుని నా స్కూల్ బ్యాగ్ అందుకొని దూకాడు.

## 11. ప్రథమ చికిత్స

ఒకావిడ : డాక్టర్ గారు, పాము కరచింది మా వారికి
డాక్టర్ : ప్రథమ చికిత్స చేశారా?
ఒకావిడ : చేశానండి.
డాక్టర్ : ఏం చేశారు?
ఒకావిడ : పాము కరచిన చోట బ్లేడ్‌తో గాట్ పెట్టి రక్తంను నోటితో పీల్చి ఉమ్మేశానండి.
డాక్టర్ : వెరీగుడ్.... పేషంట్ స్పృహలోకి వచ్చాడా?
ఒకవిడా : లేదండి.. రక్తం అంతా పోయి చచ్చాడు.

## 12. టెలిఫోన్

జోగినాధం : హలో....
రామనాధం : హలో....
జోగినాధం : ఇది 08712-428299 అండి
రామనాధం : అవును
జోగినాధం : రామనాధం గారేనా మాట్లాడుతోంది.
రామనాధం : అవునండి
జోగినాధం : నేనయ్యబాబు... జోగినాధం మాట్లాడుచున్నాను.
రామనాధం : అమలాపురమా!
జోగినాధం : అవునండి.
(ఫోన్ కట్ అవుతుంది. మళ్ళీ రింగ్ చేసి)
రామనాధం : హలో
జోగినాధం : హలో... జోగినాథం మాట్లాడుచున్నాను.
రామనాధం : హలో
జోగినాధం : హలో... జోగినాథం మాట్లాడుచున్నాను. నేనయ్యా బాబు... మధ్యలో ఈ ఫోన్ కటింగ్ ఒకటి. అదేనయ్యా నేను పంపించిన లారీ సరుకు డబ్బులు ఇంకా అందలేదు.... ఆ లక్ష

రూపాయలు... హలో... హలో... హలో...

రామనాథం : ఆ చెప్పండి... వినబడటము లేదు.

జోగినాథం : అదేనయ్యా బాబు లక్ష రూపాయలు పంపించండి.

రామనాథం : కొద్దిగా గట్టిగా చెప్పవయ్యా

ఆపరేటర్ : సార్... అతను గట్టిగానే చెప్పుచున్నాడు. కదా! వినబడనట్లు మాట్లాడతారెంటి.

రామనాథం : మీరు ఎవరండి మధ్యలో

ఆపరేటర్ : నేను.... టెలిఫోన్ ఆపరేటర్‌ని

రామనాథం : మీకు వినబడిందా లక్ష గురించి

ఆపరేటర్ : చక్కగా వినబడింది.

రామనాథం : అయితే.... నువ్వు కట్టు

## 13. సర్‌ప్రైజ్

గడ్డం మీసాలు పెంచిన శనేశ్వరరావు చాలా కాలం తర్వాత భార్యను సర్‌ప్రైజ్ చేద్దామని గడ్డం మీసాలు తీయించుకొని వంట గదిలో వంట చేస్తున్న తన భార్యను అమాంతం వెనుక నుండి కౌగిలించుకొన్నాడు. వెంటనే ఆవిడ, వెనుక ఉన్న తన భర్త ముఖం చేతులతో తడుముతూ ఇలా అంది

భార్య : ఏంటి గోపాల్ ఇలా సడెన్‌గా వచ్చావ్. మా ఆయన ఊళ్ళోనే ఉన్నారు తెలుసా!

## 14. గడియారం

చంద్రమౌళి : గురువు గారు టైమెంతయ్యింది?

కామేశ్వరరావు : రెండు చేతులకున్న రెండు గడియారాలు ఒక్క నిమిషం చూసి "సరిగ్గా పది గంటలయ్యింది".

చంద్రమౌళి : గురువు గారు నాకో చిన్న అనుమానం మీరు రెండు చేతులకు గడియారాలు పెట్టుకున్నారేంటి?

కామేశ్వరరావు : ఎందుకంటే. ఒక గడియారంలో పెద్దముల్లు లేదు. మరో గడియారంలో చిన్న ముల్లు లేదు.

## 14. జోతిష్యం

జోతిష్కుడు : జోతిష్కం చెబుతాను... జరిగినది చెబుతాను. జరగబోయేది చెబుతాను. మనస్సులోని మాట మంచి కోరికను చెబుతాను.

ఒకతను : సార్... నాకు చెప్పించండి చిలక జ్యోసం

జోతిష్కుడు : నీ కొరిక ఏంటో ఒక పేపరు పై వ్రాసి నాకు కనబడకుండ ఈ కార్డు క్రింద పెట్టు.

నాకు పిల్లలు పుడతారా? లేదా? అని వ్రాసి కార్డు కింద పెట్టాడాయన... వెంటనే చిలుక వచ్చి కార్డు తీసిచ్చింది.

జోతిష్కుడు : నీ మనస్సులోని మాట చాలా చక్కగా వ్రాశావు. ఆ కోరిక నీ వల్ల తీరదు. నీ మిత్రుల వలన తీరుతుంది.

## 15. సంగీత కచేరి

శ్రీలక్ష్మి ఇలా కచేరీ చేస్తోంది .....

శ్రీలక్ష్మి : సా....రీ....గా....మా...

పండితుడు : ఎవడితండి ఈవిడ ఇలా పాడుతుంది. ఆ... ఎవడితండి?

ఎడమపక్కతను : నా భార్యండి

పండితుడు : రామ... రామ... నీ భార్య గురించి కాదు పాట బాగానే పాడుతుంది. ఆపాట రాసినోన్ని తిడతాన్నా ఎవడా పాట రాసిండు.

కుడిపక్కతను : నేనండి

ఈవిడ తెల్లారి మరో ప్రోగ్రాము చేస్తు హిం[illegible] శాస్త్రీయ సంగీతాలు మేళవించి, రెండు కలిపి కొత్త ప్రయో[illegible] ఇలా పాడింది.

శ్రీలక్ష్మి : హా.... హా....హ్రా.... హ్రూ...... హ్రే అనేసరికి....
అందరూ వెళ్లిపోయారు. ఇద్దరు మాత్రం అలాగే కూర్చొని ఉన్నారు.

శ్రీలక్ష్మి : నాయనా! అందరూ వెళ్లినా మీరిద్దరు అలాగే కూర్చున్నందుకు సంతోషం. ఇంతకు మీరెందు కూర్చున్నారు.

మొదటివాడు : మీ ప్రోగ్రాం తరువాత నా ప్రోగ్రాం ఉంది.

రెండవవాడు : మీరు కుర్చున్న చాప నాదండి!

**(శ్రీలక్ష్మి తన అబ్బాయితో కలిసి మరుసటి రోజు ఒక ఫంక్షన్ కెళ్లింది. ....)**

అబ్బాయి : అమ్మా.... అమ్మా నేను మూత్రానికెళతాను.

శ్రీలక్ష్మి : చూడు బాబు... ఇంత మందిలో ఇలా అడుగకూడదు. ఎందుకంటే మన పరువు పోతుంది. నీకెప్పుడైనా మూత్రం వస్తే నేను పాట పాడతాను అని చెప్పు. నేను అర్థం చేస్కొని బయటికి తీస్కొని పోతానని నచ్చ జెప్పింది.
ఒకరోజు రాత్రి 12 గంటలకు....

అబ్బాయి : నాన్నా.... నాన్నా నేను పాట పాడతాను.

తండ్రి : ఓరి.... నాయనా నువ్వు నాతో మాట్లాడటమే చాలా సంతోషం. ఏది నా చెవిలో పాడు అన్నాడు.
వాడు చెవిలో పాడేశాడు.

> మిమిక్రీ నేర్చుకోవడం అనేది పరిశీలనా శక్తి, పరిపక్వత, సంసిద్ధత, సాధన, ప్రేరణ, శిక్షణ మొదలగు అంశాలపై ఆధారపడి ఉంటుంది.
>
> **-బొమ్మ శ్రీనివాస్**



# రచయిత గురించి

అది 1988. తేది రాసుకోని సుదినం. డైరీకెక్కని శుభదినం. వేదిక **C.K.M.** కళాశాల సెమినార్ హాల్. శ్రీను స్టేజి ఎక్కి 'ఇప్పుడు నేను మిమిక్రీ చేయబోతున్నానని' ప్రకటించగానే విద్యార్థులంతా ఈలలు, అరుపులు, చప్పట్లు, నవ్వులు కేరింతల తోరణాలతో స్వాగతం పలికారు. క్షణంలో ఆ వాతావరణం శోభాయమానంగా అయ్యింది.

రకరకాల శబ్దాలు, సినీనటుల డైలాగులు విన్పిస్తున్నప్పుడు ప్రతి సౌండ్‌ని అభినందించడం ప్రతి డైలాగ్‌ని అనునయించడం, జోక్ వేస్తున్నంతసేపు ప్రేక్షక సమూహారం కడుపు చేతబట్టి నవ్వటం, ఇనుప ఊచలకు వేలాడిన విద్యార్థులంతా నవ్వాపుకోలేక ఒక్కసారిగా కుప్పకూలడం ఇప్పటికీ నాకు బాగా గుర్తుంది. అనంతరం ఇది నా మొదటి ప్రోగ్రాం అంటూ శ్రీను ప్రకటించడం, గురువులు ఆశీర్వదించడం, మిత్రులు అభినందించడం చకచకా జరిగిపోయాయి. ఈ అద్భుత సంఘటన నుండి ఒక్కసారిగా తేరుకొని నేను శీను దగ్గరికెళ్ళి ప్రత్యేక అభినందనలు తెల్పడం, పరస్పర పరిచయాలు తేనీరు సేవించడాలతో మా స్నేహానికి జరిగిన అంకురార్పణ దినదిన ప్రవర్ధమానమై, ఇంతింతై వటుడింతై అన్నట్లు మాతో పాటు మా రెండు కుటుంబాలనే ఒక్కటి చేసింది.

శ్రీ బొమ్మ వెంకటయ్య, కళావతి పుణ్యదంపతులకు జూన్ 2, 1969 న జన్మించిన ఏకైక పుత్ర అణిముత్యం శ్రీ బొమ్మ శ్రీనివాస్.

నలుగురు చెల్లెళ్ళకు అప్పుడైన అన్నయ్య శ్రీనివాస్. నిగర్వి, మృదుభాషి, నిష్కల్మషమైన స్నేహశీలి, నిరంతర కృషీవలుడు, నిరాడంబరత్వానికి నిలువెత్తు సాక్ష్యం శ్రీ బొమ్మ శ్రీనివాస్.

మిమిక్రీ శ్రీనివాస్ గారి ప్రేరణ, వై. పరమేశ్వర్‌రావుగారి శిష్యరికం, మిమిక్రీ పీఠాధిపతి డా॥ నేరెళ్ళ వేణుమాధవ్‌గారి ఆశీస్సులు పొందిన కళా కుసుమం శ్రీ బొమ్మ శ్రీనివాస్.

కళలకు ఏమాత్రం సంబంధం లేని ఒక సామాన్య కుటుంబంలో పుట్టిన శీను 6వ తరగతి చదువుచుండగా మిమిక్రీ శ్రీనివాస్‌గారి ప్రోగ్రాం చూసి పొందిన ప్రేరణతో మిమిక్రీయే ఊపిరిగా బతుకునారంభించాడు. అంతేకాదు ప్రకృతిలోని ప్రతి అణువు నుండి ప్రేరణ పొందుతూ ఎడారిలో ఒయాసిస్సులా రూపొందాడు. మిమిక్రీ రంగంలోని ఒక్కొక్క శిఖరాన్ని అధిరోహిస్తూ తన జైత్రయాత్రను కొనసాగిస్తున్నాడు. దశాబ్దానికి పైగా 1800లకు మించి ప్రదర్శనలిచ్చి అశేష కళాభిమానుల గుండెల్లో స్థానాన్ని సుస్థిరం చేసుకున్న కళాకారుడు. ఆంధ్రదేశంలోనేకాక, గుజరాత్, మహారాష్ట్ర ఒరిస్సా కర్ణాటక, తమిళనాడు మొ॥ రాష్ట్రాల్లో పర్యటించి, మిమిక్రీ, వెంట్రిలాక్విజమ్ ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల మన్ననలందుకున్న ప్రతిభాశాలి. ఈయన సౌండ్స్, తెలంగాణా మాండలికంలో జోక్స్, అడ్వర్టైజ్‌మెంట్స్, ఇండియన్ న్యూస్ రివ్యూ, రేడియో, టి.వి., సినీకళాకారుల కంఠస్వరాలను అద్భుతంగా అనుకరించడంలో దిట్ట.

ఈయన 'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ' బిరుదుతో పాటు, ప్రభుత్వ విప్ శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావు గారి చేతుల మీదుగా కళావాహిని "టాప్ టెన్" అవార్డునూ, "మిలీనియం బెస్ట్ మిమిక్రీ ఆర్టిస్ట్" అవార్డుని యునెస్కో క్లబ్ ఆఫ్ రేపల్లె వారిచే, జిల్లా స్థాయి "బెస్ట్ యూత్ అవార్డ్" ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరపున వరంగల్ జిల్లా కలెక్టర్ శ్రీ ప్రభాకర్‌రెడ్డి గారిచే మరియు "ఉగాది పురస్కారం" జె.బి. కల్చరల్ ఆర్ట్ సొసైటీ వారిచే అందుకున్నాడు.

సినీప్రముఖులు అక్కినేని, యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, ఏ.వి.యస్. డా॥ సి. నారాయణరెడ్డి, పరుచూరి గోపాలకృష్ణ, తమ్మారెడ్డి, మాజీ ముఖ్యమంత్రులు శ్రీ మర్రి చెన్నారెడ్డి, నాదెండ్ల, ప్రస్తుత ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు గారిచే, ప్రజాకవి కాళోజి, డా॥ నేరెళ్ళ, అర్జున అవార్డు గ్రహీత పిచ్చయ్య, అజయ్‌శర్మ (అథ్లెట్) గారిలాంటి ఎంతో మంది ప్రముఖుల చేతుల మీదుగా సత్కారాలను, ప్రశంశలను అందుకోవడం ఆయన కళాతృష్ణకు తార్కాణం.

ఏ కళారాధకుడు ఆయన ప్రతిభకు మెచ్చి మొదట చప్పట్లు చరిచాడో, ఏ కళాతపస్వి అతని అద్భుత హాస్యానికి మొదటి చిరునవ్వు చిందించాడో అతనికి ఉజ్వలమైన భవిష్యత్తునే ప్రసాదించాడు. లేకుంటే సుశిక్షితుడైన సైనికుడు కదన రంగాన గెలుపే లక్ష్యంగా ముందుకు ఎలా దూసుకుపోతాడో శ్రీను అలాగే సాగిపోయేవాడు కాదు. ఈనాడు కేవలం ప్రదర్శనలకే పరిమితం కాక, మిమిక్రీకి సంబంధించిన పుస్తకాల్ని వెలువరించి గొప్ప సాహసాన్ని చేసి డా॥ నేరెళ్ళ వేణుమాధవ్ అంతటి మహానుభావుల సరసన చేరటం అతని పూర్వజన్మ సుకృతం తప్ప మరొకటి కాదు.

## మిమిక్రీ...మిమిక్రీ పుస్తకం గురించి...

శ్రీను వ్రాసిన మొదటి పుస్తకం మిమిక్రీ...మిమిక్రీ, ఇది మిమిక్రీ కళలోనే మొదటి పుస్తకం.మిమిక్రీ కళకు మానవ శరీర ధర్మం, భౌతిక శాస్త్రం సూత్రాలు, మనో విజ్ఞానం (సైకాలజి), లోక జ్ఞానం, ఇతర కళల పరిచయం అవగాహనమైన పరిశీలన ఇలాంటి శాస్త్రీయ ఆధారాలున్నాయని ఈ పుస్తకం చాటి చెపుతుంది. మిమిక్రీ నిర్వచనం, మిమిక్రీ పుట్టుపూర్వోత్తరాలు, మిమిక్రీలో రకాలు, మిమిక్రీ ఎలాంటి వారికి తొందరగా వస్తుంది మిమిక్రీ చేసేవారు తెలిసిన వారినే ఎందుకు అనుకరిస్తారు. అసలు మిమిక్రీ కళాకారులు ఎలా తయారౌతారు, ఈ కళ వలన ప్రయోజనం, జుగల్‌బంధి, వెంట్రిలాక్విజం మానవునికి

అనుకరణకు గల సంబంధాలు, సైన్స్‌కు మిమిక్రీకి గల సంబంధాలు మిమిక్రీ ప్రదర్శనలో తీసుకోవలసిన జాగ్రత్తలు, మిమిక్రీ సెలబస్ ఇలాంటి అనేక విషయాల గురించి, చక్కటి హాస్య సన్నివేశాలతో అనేక ఉదాహరణతో, అటు సాధారణ ప్రేక్షకులకు, ఇటు అభ్యాసకులకు తెలియవచ్చేటట్లు  శాస్త్రియంగా సిద్ధాంతాలతో రచించిన బొమ్మ శ్రీనివాస్ అభినందనీయుడు.

## శ్రీను జీవితాశయం - విశ్లేషణ :

ఇక ఆయన జీవితాశయం గురించి ప్రస్తావించినపుడు పాన్, గుట్కా, మధ్యపానం, జూదం లాంటి అనేక దుర్వ్యసనాలు నేటి మన సమాజాన్ని దహించి వేస్తున్నాయని ఆవేదన చెందుతాడు. ఇవి చాలవన్నట్లు మూలిగే నక్క మీద తాటికాయ పడ్డ చందంగా సాంఘిక అసమానతలు భాషా  ప్రాంత బేదాలు, కులమత వైశమ్యాల వల్ల భావితరాలకు కలిగే అనర్ధాల  నేపధ్యలో పట్టువదలని విక్రమార్కుడిలా ఈ సామాజిక రుగ్మతలను తన శక్తి మేరకు మిమిక్రీ ప్రదర్శన ద్వారా రూపుమాపే ప్రయత్నం చేస్తానంటాడు. కుటుంబ నియంత్రణ, పల్స్‌పోలియో, అక్షరాస్యతా ప్రాముఖ్యతల్ని తనదైన బాణీలో మిమిక్రీ ద్వారా తెలియజెప్పి ప్రజల్ని చైతన్య పరిచే మహాయజ్ఞం నిర్వహిస్తున్నాడు.

మతం కన్నా 'కళ'గొప్పదని, ప్రాంతం కన్నా 'దేశం' గొప్పదని నమ్మే శ్రీనివాస్ నవ్వు ఆరోగ్యానికి 'టానిక్' లాంటిదంటాడు. నవ్వడం వల్ల విడుదలయ్యే 'ఎండార్ఫిన్'ఎంజైమ్ ఒక్క క్షణం నవ్వితే, నాలుగు క్షణాల ఆయుష్షు ప్రసాదిస్తుందని, మతం మనుష్యుల్ని వేరు చేస్తే, కళ ఏకం చేస్తుందని ఎలుగెత్తి చాటే శ్రీనివాస్ యువతకు ఆదర్శ ప్రాయుడు. ఈయన కళారంగంలో వరంగల్ కీర్తి బావుటా ప్రపంచ స్థాయిలో ఎగరేసి జగజ్జేత కావాలని ఆశిస్తూ...

-షేక్ హాజి నూరాని

# ప్ర శం స లు

1. ఇండియన్ న్యూస్‌రివ్యూ క్రియేటివిటి చాలా గొప్పగా వుంది నాయనా!
-'పద్మ విభూషణ్' కాళోజి నారాయణరావు

2. పి.వి. నర్సింహారావు, రావుగోపాలరావు, శాంతిస్వరూప్ & అంజనేయ శాస్త్రిలను అనుకరించడంలో శ్రీ బొమ్మ శ్రీనివాస్‌కు సాటిలేరు.
- 'పద్మశ్రీ' డా॥ నేరెళ్ళ వేణుమాధవ్

3. ఇక్కడ ఇంత జనం ఉన్నారంటే అది కేవలం శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రోగ్రామ్ చూడటానికి మాత్రమేనని గర్వంగా చెప్పగలను.
-'అర్జున్ అవార్డు గ్రహీత' శ్రీ పిచ్చయ్యగారు

4. బొమ్మ శ్రీనివాస్‌గారి ప్రోగ్రామ్ మూడుసార్లు చూసి ఎంతో ఆనందించాను. మళ్లీ మళ్లీ వినాలనిపిస్తుంది.
-కేంద్ర మంత్రి 'రెబల్ స్టార్' కృష్ణంరాజు

5. రేడియో న్యూస్ రీడర్లవాయిస్, తెలంగాణ జోక్స్ చెప్పడంలో శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రతిభ అమోఘం.
- 'సినీ హాస్య నటులు' బాబు మోహన్

6. శ్రీ బొమ్మ శ్రీనివాస్ వినిపించిన 'తెలంగాణ మాండలికం' జోక్స్ కడుపుబ్బ నవ్వించాయి. తెలంగాణ జోక్స్ క్రియేటివిటి అద్భుతం.
- 'మాజీ కేంద్రమంత్రి' శ్రీ ధర్మన్న సాదులు
- 'ప్రభుత్వ విప్' శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావు

7. నా తోటి మిత్రులందరూ వెళ్లినా ఈ బొమ్మ (టాకింగ్ డాల్) ఎలా మాట్లాడుతుందో చూడటానికి ప్రోగ్రామ్ చివరి వరకు ఉన్నాను. అదో అద్భుత కళ. ఇందులో శ్రీ బొమ్మ శ్రీనివాస్ ప్రతిభ అమోఘం.
-'మాజీ రాష్ట్ర మంత్రి' శ్రీ తక్కెళ్ళపల్లి పురుషోత్తమరావు

8. వరంగల్ కీర్తి ప్రతిష్ఠలను ఆంధ్రప్రదేశ్‌లోనే కాక ఇతర రాష్ట్రాలకు తెలియజేసిన కళాకారుడు శ్రీ బొమ్మ శ్రీనివాస్.
-శాలినీ మిశ్రా ఐ.ఎ.ఎస్.

9. ఆయనలో ఉన్న మరో గొప్పతనం ఏమంటే సుత్తి కొట్టకుండ డైరెక్ట్‌గా ఐటానికి వెళ్లిపోతాడు. శ్రీబొమ్మ శ్రీనివాస్ ప్రోగ్రామ్‌లో 100% కామెడి ఉంటుంది.

- 'మ్యూజిక్ డైరెక్టర్' శ్రీ సీతాల రఘువేందర్

- శ్రీ శంకర్, కీ॥శే॥ సారంగపాణి - సినీగాయకులు

10. ఒక ప్రోగ్రామ్‌లో దాదాపు 350 రకాల గొంతుల్ని మార్చగల ప్రతిభావంతుడు శ్రీ బొమ్మ శ్రీనివాస్.

- 'వరల్డ్ రికార్డ్ హోల్డర్' మైమ్ కళాధర్

11. వెయ్యి గొంతుల కలయిక మిమిక్రీ శ్రీనివాస్

-కీ॥శే॥ బుర్రకథ హనుమంతరాజు

12. బొమ్మ శ్రీనివాస్ తన టాకింగ్ డాల్ ప్రదర్శనలో కొత్తదనం చూపడం అందరికి నచ్చింది. టాకింగ్ డాల్ మాట్లాడే విధానాన్ని ఇంద్రజాల ప్రదర్శన గుర్తుకు వచ్చేలా చేసి చూపాడు.

-'ఈనాడు' దినపత్రిక

13. నాకు తెలిసినంతవరకు తెలుగులో అచ్చంగా మిమిక్రీ కళపై వెలువడిన తొలిరచన 'మిమిక్రీ...మిమిక్రీ'

-'విద్వాన్' టి.వి. సుబ్బారావు

14. మిమిక్రీ కళపై కరదీపికలాంటి పుస్తకం 'మిమిక్రీ...మిమిక్రీ'

-ఆచార్య గోపి, మాజీ వైస్ చాన్స్‌లర్, పొట్టి శ్రీరాములు యూనివర్సిటీ

15. He is trying his level best to eradicate these bad habits from the minds of people through this art of "Mimicry"

-ప్రొ॥ విద్యావతి, మాజీ వైస్ చాన్స్‌లర్, కాకతీయ యూనివర్సిటీ

16. ఎదుటివారిని నవ్వించటానికి తనపై తానే జోక్స్ క్రియేట్ చేస్కొని నవ్వించడానికి ఏ మాత్రం వెనుకాడని గొప్ప వ్యక్తి శ్రీబొమ్మ శ్రీనివాస్ ఆయన ఎప్పుడూ నవ్వుతూ - నవ్విస్తూంటాడు.

- మిత్రులు

## వివిధ పత్రికల్లో బొమ్మ శ్రీనివాస్ ఆర్టికల్స్

1. 'బహుముఖ ప్రజ్ఞాశాలి' - అక్టోబర్ 8, 1994 - వరంగల్‌వాణి
2. 'మిమిక్రీలో రాణిస్తున్న బొమ్మ శ్రీనివాస్' - నవంబర్ 11, 1997 - వార్త
3. 'స్వరానికే స్వరమాంత్రికుడు' బొమ్మ శ్రీనివాస్
   - జనవరి, 1998 - వరంగల్‌ఎక్స్‌ప్రెస్
4. 'స్వర' మాంత్రికుడు శ్రీనివాస్ - డిసెంబర్ 7, 1998 - ఆంధ్రప్రభ
5. 'మిమిక్రీ శిక్షణా శిబిరాన్ని ప్రారంభించిన బొమ్మ శ్రీనివాస్'
   - 1998 - వాయిస్
6. 'బహుముఖ ప్రజ్ఞాశాలి బొమ్మ శ్రీనివాస్' - జనవరి 30, 1999 - వార్త
7. 'ధ్వన్యనుకరణ ప్రవీనుడు బొమ్మ శ్రీనివాస్' - జూలై 29, 1999 - పొద్దు
8. 'ధ్వన్యనుకరణ ప్రతిభాశాలి బొమ్మ శ్రీనివాస్'
   - సెప్టెంబర్ 29, 1999 - విశాలాంధ్ర
9. 'విజ్ఞాన విశేషాలతో విస్తృతంగా మిమిక్రీ ప్రదర్శనలిస్తున్న బొమ్మ శ్రీనివాస్'
   - డిసెంబర్ 15, 1999 - కళాకేంద్రం
10. 'మిమిక్రీ పరిచయం బొమ్మ శ్రీనివాస్'
    - డిసెంబర్ 15, 1999 - సేవాప్రపంచం
11. 'ధ్వని అనుకరణ అతని కంఠాభరణం'
    - జనవరి, 2000 - భావతరంగిణి
12. 'మిమిక్రీలో ప్రజ్ఞాశాలి బొమ్మ శ్రీనివాస్'
    - ఫిబ్రవరి, 2000 - కళాజగతి
13. 'ధ్వన్యనుకరణ ప్రపూర్ణ బొమ్మ శ్రీనివాస్'
    - మే, 2000 - పద్మపీఠం
14. 'ప్రపంచాన్ని వెలుగుచూసిన మిమిక్రీ పుస్తకం'
    - నవంబర్ 7, 2000 - చర్చ
15. 'మిమిక్రీ...మిమిక్రీ... పుస్తకాన్ని శాస్త్రీయంగా సిద్ధాంతాలతో రచించారు'
    - జూన్ 2001 - ఇండియా టుడే



# కృతజ్ఞతలు

## Thanks

| | |
|---|---|
| శ్రీ ఎర్రబెల్లి దయాకర్‌రావుగారికి | ప్రభుత్వ విప్, ఆంధ్రప్రదేశ్. |
| శ్రీ డా॥ రాజేశ్వర్‌రావుగారికి | మేయర్, వరంగల్. |
| శ్రీ ఎడబోయిన బస్వారెడ్డిగారికి | చైర్మన్, వరంగల్ జిల్లా పరిషత్. |
| శ్రీ గుండు ప్రభాకర్‌గారికి | డైరెక్టర్, వరంగల్ అర్బన్ కో-ఆ. బ్యాంక్. |
| శ్రీమతి గుండు సుధారాణిగారికి, | డైరెక్టర్, తిరుమల తిరుపతి దేవస్థానం. |
| శ్రీ డా॥ బండా ప్రకాష్‌గారికి | సెక్రటరీ, ఆం.ప్ర. కాంగ్రేస్ కమిటి . |
| శ్రీ కృష్ణారావుగారికి | నెహ్రూ యువజన కేంద్రం. |
| శ్రీ కొలువుల సుధాకర్‌గారికి | కార్పోరేటర్, 35వ డివిజన్, వరంగల్. |
| శ్రీ చింతాకుల సురేందర్‌గారికి | సెక్రెటరీ, బి.జె.పి. అర్బన్ జిల్లా. |
| ప్రొ॥ శ్రీమతి విద్యావతిగారికి | మాజీ వైస్ చాన్సలర్, కాకతీయ యూనివర్సిటి |
| శ్రీ ఆచార్య గోపిగారికి | మాజీ వైస్ చాన్సలర్, పొట్టి శ్రీరాములు " |
| శ్రీ పోకల చందర్‌గారికి | డిస్ట్రిక్ట్ గవర్నర్, లయన్స్ క్లబ్ 324-C3 |
| శ్రీ శ్రీపెరంబదూర్ వెంకటస్వామిగారికి | యం.పి.పి., కేసముద్రం మండలం |
| శ్రీ బి. సుదర్శన్‌రావుగారికి | యం.ఇ.ఒ., కేసముద్రం |
| శ్రీ కె. సురేందర్‌గారికి | జెడ్.పి.టి.సి., కేసముద్రం |
| శ్రీ ప్రవీణ్‌కుమార్‌రెడ్డిగారికి | యం.డి.ఒ., కేసముద్రం |
| శ్రీ నారాయణగారికి | యం.ఆర్.ఓ., కేసముద్రం. |
| శ్రీమతి కె. కొమురమ్మగారికి | యం.పి.టి.సి., కోమటిపల్లి. |
| శ్రీమతి సి.హెచ్. అరుణ గారికి | సర్పంచ్, కోమటిపల్లి. |

బొమ్మ శ్రీనివాస్

| | |
|---|---|
| శ్రీ టి.వి. సుబ్బారావుగారికి | ప్రముఖ రచయిత |
| శ్రీ కొండబత్తిని జగదీశ్వర్‌రావుగారికి | ప్రముఖ రచయిత |
| శ్రీ అంపశయ్య నవీన్‌గారికి | ప్రముఖ రచయిత |
| శ్రీ పొట్లపల్లి శ్రీనివాసరావుగారికి | ప్రముఖ రచయిత |
| శ్రీ గుండేటి రమేశ్‌గారికి | సినీపాటల రచయిత |
| శ్రీ అంకం సత్యంగారికి | కంప్యూటర్ ఫోటో ప్రింటర్, |
| శ్రీ డా॥ జయప్రకాష్‌గారికి | లయన్స్ క్లబ్ మెంబర్ |
| శ్రీ డా॥ వీరేశంగారికి | మేనేజింగ్ డైరెక్టర్, కిమ్స్ హాస్పిటల్ |
| శ్రీ డా॥ మీనాక్షిగారికి | నిర్మల హాస్పిటల్ |
| శ్రీ డా॥ సత్యదేవ్‌గారికి | నిర్మల హాస్పిటల్ |
| శ్రీ డా॥ కొణతం కృష్ణగారికి | ఆర్గనైజింగ్ సెక్రటరి,<br>ఓరుగల్లు యునైటెడ్ చారిటబుల్ ట్రస్ట్ |
| శ్రీ డా॥ వి. సాంబశివరావుగారికి | సెక్రటరి, A.P. E.N.T. డాక్టర్స్ అసోసియేషన్ |
| శ్రీ యస్. యన్. చారిగారికి | సెక్రెటరి, ప్రేక్షక సభ |
| శ్రీ దుస్సా చంద్రమౌళిగారికి | కన్వీనర్, ఓరుగల్లు కళాపీఠం. |
| శ్రీ వనం లక్ష్మీకాంతరావుగారికి | సహృదయ సాహిత్య సాంస్కృతిక సంస్థ. |
| శ్రీ ఆలేటి శ్యాంసుందర్‌గారికి | రోజా క్రియేషన్స్. |
| శ్రీ జడల శివగారికి | జె.బి. కల్చరల్ ఆర్ట్స్ సొసైటి. |
| శ్రీ డా॥ రహమతుల్లాగారికి | చైతన్య కల్చరల్ అకాడమి, పర్లాక్‌మిడి. |
| శ్రీ సి.హెచ్. సుదర్శన్‌గారికి | 'కీ బోర్డ్' ప్లేయర్ & ఆర్కెస్ట్రా కళాకారులు. |
| శ్రీ కె.వై.యల్. నరసింహంగారికి | సంస్కృత పండితులు, మచిలీపట్నం. |
| శ్రీ పి.ఆర్. మోహన్‌రావుగారికి | కళానిలయం స్థాపకులు, చిలకలూరిపేట. |
| శ్రీ నాట్యరత్న రజనీశ్రీగారికి | నృత్య దర్శకులు, హుస్నాబాద్. |
| శ్రీ చొక్కాపు వెంకటరమణగారికి | మెజీషియన్, హైద్రాబాద్. |
| శ్రీ కందగట్ల కళాధర్‌గారికి | మైమ్ ఆర్టిస్ట్, హైద్రాబాద్. |
| కీ॥శే॥ దీకొండ సారంగపాణిగారికి | సినీ గాయకులు, వరంగల్. |
| శ్రీ రంగనాథ్‌గారికి | గాయకులు, నర్సంపేట. |

| | |
|---|---|
| శ్రీ శ్రీరాంగారికి | టెలిస్కూల్ ఫిల్మ్ నిర్మాత, హైద్రాబాద్. |
| శ్రీ శ్రీనివాస్‌గారికి | ఉమా ఆడియోస్, వేములవాడ. |
| శ్రీ గుజ్జారి రమేశ్‌గారికి | ఘంటశాల గాయకులు, వరంగల్. |
| శ్రీ దేవులపల్లి సదానందంగారికి | లెక్చరర్, పంజతన్ కాలేజ్. |
| శ్రీ డా॥ రవికాంత్‌గారికి | లెక్చరర్, సైకాలజి. |
| శ్రీ రాంబాబుగారికి | లెక్చరర్, బి.ఇడి. కాలేజ్. |
| శ్రీ బి. సుధాకర్‌గారికి | ప్రోగ్రాం ఆఫీసర్, మధురై కామరాజ్ కాలేజ్ |
| శ్రీ రాజన్‌బాబుగారికి | మాజీ ప్రెసిడెంట్, భీమారం లయన్స్ క్లబ్ |
| శ్రీ మోత్కూరి మనోహర్‌రావుగారికి | ప్రెసిడెంట్, భీమారం లయన్స్ క్లబ్. |
| శ్రీ కంచర్ల మహేందర్‌గారికి | విజయ్ ప్రింటింగ్ ప్రెస్, వరంగల్. |
| శ్రీ సర్దార్ మహేందర్‌సింగ్‌ధీర్‌గారికి | బ్లూస్టార్ చిట్‌ఫండ్స్ |
| శ్రీ మామిడాల వేణుగోపాల్‌గారికి | డి.టి.పి. ఆపరేటర్ |

కళాకారులందరికి,

విశాలాంధ్ర బుక్‌హౌజ్‌వారికి,

ప్రజాశక్తి బుక్ హౌజ్‌వారికి,

ఉదయశ్రీ బుక్‌హౌజ్ వారికి,

వరంగల్ ప్రెస్ క్లబ్‌వారికి,

పత్రికా విలేఖరులందరికి,

మీడియా విలేఖరులందరికి,

మిత్రులకు, శ్రేయోభిలాషులకు, బంధువులకు,

ఇంతవరకు నా ప్రోగ్రామ్స్ ఏర్పాటు చేసిన ప్రతి ఒక్కరికి

మరియు ప్రేక్షకులందరికి పేరుపేరునా

హృదయపూర్వకంగా.......................................................................................

SENIOR CLUB IN INDIA AND ABROAD ☎ 08648-22195 e-mail haribabu_battu@usa.net Estd 1978

# UNESCO CLUB OF REPALLE

## AKSHARA DEEPTHI ALAYAM

(FIRST ATTEMPT IN ASIA)

Recognized by Govt. of India Ministry of Human Resource
Development Dept. of Education - NEW DELHI
Unesco 7 Place de fontenoy 75-000 - PARIS (France)
Indian National Federation of Unesco Clubs & Associations - BANGALORE
Confederation of Unesco Clubs & Associations of India - NEW DELHI
Unesco Association of Colorado - (U.S.A.)
Tokyo Liaison Council of Unesco Tokyo - JAPAN

"READ & GROW"



## INTERNATIONAL CERTIFICATE OF APPRECIATION

UNESCO TITLE " UNESCO MILLENNIUM BEST MIMICRY ARTIST " .

This is to certify that ... BOMMA ... SRINIVAS ... MIMICRY ... ARTIST ... WARANGAL

is Honoured for the Work Done in ... MIMICRY ... TALKING DOLL - & MIMICRY BOOK WRITER

and is Awarded Hon. Membership of Our Senior Club.

ISSUED UNDER THE SEAL OF UNESCO CLUB OF REPALLE THIS DAY AT REPALLE

D. 11/7/200

BATTU BHASKARAMMA
CONVENOR
STATE MAHILA UNESCO CLUBS
"AKSHARA DEEPTHI ALAYAM"
REPALLE 522 265

BATTU HARIBABU
INTERNATIONAL UNESCO MEDAL WINNER
NATIONAL BEST UNESCO CLUB LEADER
JAPAN CULTURAL GOLD MEDAL WINNER

Sponsored by BATTU HARI BABU GROUP (Regd.) in Rescue Mission : Planet Earth Project Peace Child International Centre BUNTING FORD United Kingdom
DREAD VIOLENCE SPREAD PEACE AND TOLERANCE

# Certificate of Membership

## The International Association of Lions Clubs

LIONS CLUBS INTERNATIONAL

Be it known that

Ln. Srinivas Bomma.

is a Charter Member of the Lions Club of

BHEEMARAM - HNK.

in accordance with the Constitution and By-Laws of this Association. In witness whereof this Certificate of Membership has been issued this 25th day of April - 2001.

INTERNATIONAL PRESIDENT

CLUB PRESIDENT

THE INTERNATIONAL ASSOCIATION OF LIONS CLUBS
LIONS
SEAL

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## ప్రశంసా పత్రము

శ్రీ బొమ్మ శ్రీనివాస్, ప్రధానోపాధ్యాయులు, వరంగల్ గారు

మిమిక్రీ కళ ద్వారా ప్రజలను చైతన్య పరిచినందుకు గుర్తింపుగా గణతంత్ర దినోత్సవ

సందర్భముగా ఈ ప్రశంసా పత్రమును ప్రదానము చేయుచున్నాము.

తేది: 26-01-2002

కలెక్టర్ మరియు
జిల్లా మెజిస్ట్రేట్, వరంగల్

---

# WORKSHOP ON MIMICRY

Sponsored by

**SOUTH ZONE CULTURAL CENTRE**

Thanjavur

## Certificate of Appreciation

*This is to certify that Mr.* BOMMA SRINIVAS *has actively participated and contributed his valuable experience as a* MIMICRY ARTIST *during a 3 day Workshop on Mimicry held at Ravindra Bharathi, Hyderabad on 19, 20, 21 st September, 1997.*

**Smt. Padala Aruna**
Hon'ble Minister for Culture, Women & Childre Welfare
Govt. of Andhra Pradesh

**Dr. C. Narayana Reddy**, M.P.
Chairman, A.P. State Cultural Council,
Govt. of Andhra Pradesh

**Dr. Nerella Venu Madhav**, Ex-M.L.C.
Director,
Mimicry Workshop

